సీ. శ్రీమించు నెమ్మోము తామరవిరి తళుక్కఁ
గన్నులు విరిసిన కైరవములు
కుదురైన రదనముల్ కుందకుట్మలములు
తీరైన నాసిక తిలసుమంబు
తరళాధరోష్ఠంబు దాసానిపుష్పంబు
పొలుపైన పొక్కిలి పొన్నపువ్వు
ఆదోఁక లగుజంఘ లరఁటి పూమొగ్గలు
చక్కని మెయి శిరీషప్రసూన
గీ. మహహా మను మంచిమంచి పూ లరసి తెచ్చి
పొదవి నెమ్మేనుఁ జేసెఁగాబోలు బ్రహ్మ
దాన నిల గల యెల్ల సుందరులలోన
మాకు స్పృహణీయవై తిరామావధూటి.
సీ. నారంగములు బృహన్నారంగములుగల్గి
విలసిల్లు నుద్యాన వీథులందు
కాదంబములు పద్మకాదంబములు గల్గి
తనరారు కాసార తటములందు
పర్యంకములు మహోపర్యంకములు గల్గి
వినుతికెక్కిన సౌధవీథులందు
మణిపుత్త్రికలు నభోమణి పుత్త్రి కలు గల్గి
సౌరుమీరినచంద్రశాలలందు
గీ. మనసుమనముల మోహ ముమ్మ రముగాఁగ
మరుని(బూజించి మించి యేఁటి రతుల
నతులగతులను దేలి సమ్మతుల మీతి
శీవినుంటిమి గదవె రామావధూటి.

## ప్రతాపరుద్రచక్రవర్తి.

సీ. పూర్వాపరాబ్ధులు పొలిమేరలై యుండ
 నేరాజు జగమెల్ల నేలఁగల్గె
లక్షింపఁ దొమ్మిదిలక్షలవిలుకాండ్రు
 నేరాజుబలములో నెలమిఁ గలరు
ధరణి డెబ్బదిరేడుగురు నాయకోత్తము
 లేరాజు సేవింతు రిచ్చగించి
దాక్షిణాత్యులనెల్లఁ దటిమి జయస్తంభ
 మేరాజు నిల్పె రామేశ్వరాన
గీ. అతఁడు కాకతివీరరుద్రావనీశుఁ
డమ్మహారాజు చెప్పంగ నలరె ధాత్రి
రాజశేఖరుఁ డెంతయు రమణతోడ
జగముపాలించు భూలోకచక్రవర్తి.

## మైలమభీమన.

ఈతనిపేరఁ గల్గుపద్యములు ("గరళపుముద్ద—" ఏలువభీమ—) వేములవాడభీమకవికృతములుగా లక్షణగ్రంథములం దుదాహరింపఁబడినవి. క్రింద నుదాహరింపఁబడుపద్యములెల్ల నొక్క-వరుసలోనివే యగుటచే నొక్కరిచేతనే (భీమకవిచేత) రచియింపఁబడిన వనుకొనెదను. భీమకవిపద్యము సాహిణిమారన, చాళుక్యచొక్క-భూపతి, సాగిపోతరాజు, కళింగగంగు (చోడగంగఁడు) తెలుంగాధీశుఁడు, మైలమభీముడు, ననువారిఁ బ్రశంసించిన యగుటచేత, నాయందఱు సమకాలమువారు కాఁదగుదురు. భీమకవినిగూర్చి "ప్రబంధరత్నావళి" పీఠికలోఁ గొంత విస్తరించి చర్చించియున్నాను. విజయనగరసంస్థానపుఁబ్రభువులగు పూసపాటివారి మైలమభీమనసంబంధులట! ఈతఁడు ఏలేరు, కసిమి, వేంగి, కళింగలను జయించినట్లు పద్యములం దున్నది. ఏలువభీమ మైలమభీమ, పదము లొక్క-నిపేళ్లే.

ఉ. యాచకఖేచరుండు సుగుణాంబుధి మైలమభీమఁ డీల్గినన్
జూచి వరించె రంభ యెడఁజొచ్చెఁదిలో త్తమ; దారినిద్దఱన్
ద్రోచె ఘృతాచి ముగ్గుఱప దొడ్డడి కయ్యముపుట్టె నంతలో
నాఁచుకపోయె ముక్తిసతి నవ్విరి యద్దఱఁ జూచి నిర్జరుల్
నోఁచినవారిసొమ్ము లవి నోమనివారికి వచ్చునే ధరన్
[ఇందలికడపటిచరణము నాచనసోముని హరివంశమందునుగలదు.]

చ. అహితులఁ దాఁకి పోరునెడ నంబుధికల్గిననాఁటిరాము గో
గ్రహణమునాఁటి పార్థు గదఁగాఁ గౌరవునేసిననాఁటిభీము నా
గ్రహమెసగం బురత్రయముఁ గాల్చిననాఁటిలలాటలోచనున్
మహి నుపమింపఁగాఁ దగునె మైలభీముని భీమవిక్రమున్.

ఉ. పన్ని తురంగమంబునకుఁ బక్కెర వెట్టినవార్త చారుచే
విన్న భయంబునంగలఁగివేసటనాఁటనె చక్ర (?) గోట్టముల్
మన్నియపట్టణంబులును మక్కున వేంగి కళింగ లాదిగా
నన్నియు నొక్కపెట్టెగసె నేలువభీమనృపాలు హాటికిన్

క. అవనిఁ లేలువభీమని
పొరువున మనలేరు చిచ్చుపొంతను వెన్నై
తెరువునఁ బైసరై జూదరి
సిరియై రేన్చెట్టుక్రింద జిల్లెడుచెట్టై.

ఉ. ఆలములో నరాతులకు హమ్మని మార్కొనవచ్చునే మహా
కాళికి శూలికిన్ బ్రళయకాలపుగాలికి రాఘవేంద్రుబా
ణాళికిఁ బక్షినాయకునఖాళికి మత్తగజేంద్రవైరిదం
ష్ట్రాళికి దావపావకశిఖాళికి మైలమభీమువాలికిన్.

ఉ. నేరుపు బ్రహ్మఁజేరె నిజనిర్మలతేజము సూర్యులఁజేరె నా
కారము కాముఁజేరె నధికం బగులక్ష్మి యనంతుఁజేరె గం

ఖీరత వార్ధిఁ జేరెఁ గలపెంపు కులాద్రులఁ జేరెఁ గీర్తిదా
నూఁటలేక త్రిమ్మరుచు నున్నది మైలమభీముఁ డీల్గినన్.

చ. గరళపుముద్దలోహ మనగాఢమహాశనికోట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయ లయకాలుఁడు కమ్మరి వైరివీరసం
హరణగుణాభిరాముఁ డగు మైలమభీమనఖడ్గసృష్టికిన్.

మ. తెరలంబాఱి నభంబు దాఁకినఁ బయోధిం జొచ్చినన్ శైలగ
హ్వరముల్ దూఱినఁ జిక్కఁ భీముఁడు నృపవ్రాతంబుఁ బోనిచ్చునే
గరుడండై చని పట్టు మింటితుద నుగ్రగ్రాహమై చొచ్చి సా
గరమధ్యంబున ద్రిమ్మంగుఁ బట్టుకొను సింగంబై గుహాంతంబునన్.

క. ఆలమునఁ జిక్కఁ భీముఁడు
వా లతివేగమునఁ బెట్టికి నడితుడగవియన్
ద్రేలిపడఁ బడుగు సేసెను ?
ఏలేరును గసిమి భైరవేశుం డెఱుఁగన్

ఉ. వీరగుణప్రతాపగుణవిశ్రుత! మైలను భీమ నీయశం
బారభమానతారకరహారవిలాసము నీనికేతనం
బాభమానతారకరహారవిలాసము నీభుజార్గళం
బారభమానతారకరహారవిలాసము చిత్ర మిద్ధరన్.

ఉ. భండనభీమ నీయెదుర బాఱక నిల్చినశాత్రవుల్ బ్రహ
న్మండలపుండరీకపురనాకనివాసులు నోర్చినన్ బ్రహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చచ్చినన్ బ్రహ
న్మండలపుండరీకపురనాకనివాసులు చిత్ర మిద్ధరన్.

చ. విదితగురుప్రతాపగుణవిశ్రుత మైలమభీమభూప నీ
పదిలపుఖడ్గదారఁ దెగి పాటినవీరుఁడు గోపురంబుపై

విదితసువర్ణరత్నమయవేదికమీఁదను నిల్చి కాంచు నా
పదిపదు లగ్నిహోత్రులను బన్నిరుసూర్యుల నూఱుచంద్రులన్.
చ. అసమునఁ గాసికానగరమం దసువుల్ త్యజియించినంతనే
యసదృశమైనకన్నుగల దచ్చట మైలమభీమభూప నీ
యసిఁ దెగిపడ్డవైరులకు నంబకముల్ పదినూఱులయ్యె నీ
యసికిని వారణాసికిని నంతర మెంత దలంచిచూచినన్.

## మాచయబ్రహ్మఁడు.

ఈతఁడు, నాచనసోమునివసంతవిలాసకృతికిఁ బతియని, యాగ్రంథమందలి మొదటిపద్యమిది యని శ్రీరామకృష్ణకవిగా రుదాహరించినారు.

శా. శ్రీచన్నుంగ్రవక్రేవఁ గ్రొమ్మెఱుఁగులన్ శృంగారపుందోఁటలన్
బ్రాచీనం బగుచున్నవింశతినఖప్రాధిన్ సుఖాంభోధివే
లాచంద్రోదయమైనదేవుఁడు కృపాలంకారచిత్తంబునన్
జూచున్ మాచయబ్రహ్మధీమణిఁ గవిస్తోమైకచింతామణికిన్.

ఈతనిఁగూర్చి చాటువు:—

సీ. కమలంబునకుఁ బుట్టి కమలంబుచుట్టమై
కమలంబు తననాభిఁ గాంచిగాక
గంగకు నుదయించి గంగ నాదలఁదాల్చి
గంగలో భువనంబు గలపిగాక
జలరాశి జన్మించి జలరాశి లంఘించి
జలరాశి బాణాగ్నిఁ జమరిగాక
వహ్నికి నుదయించి వహ్ని నెచ్చెలిఁ జేసి
వహ్ని ఖాండవముపై బ్రాఁకిగాక
గీ. ఊర కెవ్వారు నీతోడ నొరయువారు
బుద్ధితేజోరమాశౌర్యభూతి యత్న

కాంతి విక్రమఖ్యాతి సంగతుల వలరి
ప్రౌఢపోదార! మాచయప్రబహ్మశీర.

సీ. బలిమిఁ బ్రతాపునికొలువునాయంకుల
కుంచెలు మాన్పినగురుభుజుండు
భువి దొడ్డమారెమ్మగవిని దూరుచు నర్గు
ప్రకట విద్వేషినాయఁకులమగఁడు
ఎలమి డెబ్బది యేడ్గు రలరారఁగొల్చిరా
రుద్రదేవుని యొద్ద భద్రగజము
పరతేర నందఱుఁ బొఱంగఁ గరిఁద్రోచి
హరిదంతి భీమాంకుఁ డనఁగఁబరఁగి

గీ. ధరణిలోన వెలయుదండాడుగండాంక
భీమనృపతిపుత్త్రి పృథులగోత్ర
పోతుగంటి మైలభూపాల! నీచేతి
హేతి కెదురు నిల్వ నెందులేరు.

సీ మానికొండొద్ద మన్నె వేశ్యాభుజం
గాంకుబొమ్మయదేవు నాజిఁ బరపె
ఈసునఁ బైపడ్డబోసంగికడదాఁక
పరఁగ మంగయనేని భంగపఱిచె
పోరిలో మెఱయుకొండమారినల్ల యరెడ్డి
... వెసఁజీమ లేటిబయల
నుప్పరపల్లొద్ద నుద్వశక్తిఁ బైపడి
ఢిల్లితురుష్కుల త్రుళ్లడంచె
ఢిల్లిలో తెలుఁగుబిజ్జ లన్నృపాలునిగెల్చి
తావిశలకీర్తిధర్మగతిని నిల్పె?

గీ. భీమభూపాలసుతుఁడు తద్భీమబలుఁడు
వైరిగజభీముఁడమిత సత్యప్రియుండు
ఘనభుజాశాలియగు పోతుగంటుమైలి.

సీ. ఢిల్లిలో సురథానుఁ డొల్లి వేదిధరాది [?]
దృష్టుండు ప్రత్యక్షసాక్షిగాఁగ
మహనీయజయశాలి మలికినేమారుండు
జగదేకశూరులు సాక్షిగాఁగ
జగతిపై డెబ్బదేమునురు నాయంకులు
నక్షీణబలయుతుల్ సాక్షిగాఁగ
సహజసాహస యుద్ధసన్నద్ధవరభటా
శ్రయమైన దాకోలు సాక్షిగాఁగఁ

గీ. సూర్యవంశోదయ ఖ్యాతుఁడార్య తెలుఁగు
బిజ్జలనృపాలుఁ గెల్చెఁ దద్భీమబలుఁడు
వైరిగజభీముఁ డమితసత్యప్రియుండు
ఘనభుజాశాలియగు పోతుగంటుమైలి.

ఈయనకొడుకు.

సీ. మాయురే భాశోరమల్లసంహారణాంక
చాఁగురే తెలుఁగుబిజ్జలవిభాళ
హాహా సముద్ధతాహవవైరిగజభీమ
మేలుమేలు కులపిశాలిగోత్ర
హోహూసత్కీర్తి సముచ్ఛ్రిత బ్రహ్మాండ
హాహేప్రశస్తసంచాదుగండ
అవురపాంబాదేశహన్నిబ్బవరగండ
బళి చేతిదంప భూపాలదళన

గీ. యనుచుఁగొనియాడుదురునిన్ను నర్థిజనులు
మగధమాళవనేపాళమత్స్యసభల
భీమభూపాల సత్ప్రతాపృథుచరిత్ర
విభవనాభాగ మైల భూవిభునినాగ!

ఉ. వల్లభ! భోగభాగ్యసురవల్లభ! చారువివేకశారదా
వల్లభ! నిత్యసత్యరఘువల్లభ! ధర్మవిచారద్రౌపదీ
వల్లభ! వాగ్విలాసఫణివల్లభ! కాంతి విహారశారదా
వల్లభ! చింతపల్లుపురవల్లభ! అబ్బనృపాలువల్లభా!

మ. కదిలెన్ ఖండియరాయవల్లభుఁడు వేడ్కన్ దాడి యీధాత్రిపై
యదె ఛత్రం బదె చామరం బదె హయం బన్నన్ భయభ్రాంతులై
కదనోర్వీధరచాపచక్రధృతిగాఖడ్గాది శస్త్రాస్త్రముల్
చదరన్ వైచిత దీయవైరులుగిరుల్ సంప్రాప్తులై రక్కటే!

ఆతనికొడుకు.

ఉ. భండన మాటపట్టు జయభామినినెచ్చెలి చండవిద్విష
న్మండలి దేహ రక్తములు మానక పానకముల్ గ్రసించు ను
ద్దండతడాకినుల్ సఖులు తక్కినభూతము లర్థి లిమ్మహిన్
ఖండియరాయవల్లభుని గన్ననృపాలకరాసి పుత్త్రికిన్.

అతనియనుజుండు.

సీ. ప్రతిపక్షసుందరీ బంధుర స్తనముల
పసుపుపయ్యెదలకుఁ బాయుతెరువు
రిపురాయభామినీవిపులధమ్మిల్లంబు
విరులనెత్తావికి వీడుకోలు
శాత్రవకామినీ చటులనేత్రంబుల
కలికికాటుకలకుఁ గానివావి

అరిరాయభామినీయామవణాధరముల
సొబఁగు వీడెములుగాఁ జిక్కి కెదురు
గీ. చేసె నాకార ధాత్రి నీచేకరాసి
వైరిగజభీమ వల్లభేశ్వరకుమార
వనజహితతేజ ! కామినీజనమనోజ
బహుతరాటోప సింగభూపప్రతాప!

ఈసింగమనేఁడేరావు (చితువురాల) సింగమనాయని బానమఱఁది.

## జగరావు – తిప్పరాయఁడు.

సీ. యవనుల గెల్వఁడే యంపరాయలుచూడ
నెట్టైన కంబము మెట్టుబైట
పరిపంథియోధులఁ బరపఁడే వాఁడిమై
నుద్దండవృత్తి కోనూరియెద్ద
కాటయవేమ భూకాంతుసైన్యంబెల్లఁ
గొట్టఁడే యలుగుండుగొలనిక్రేవ
చమసపామాత్యుని సాచిగాఁగొట్టఁడే
కొండవీడాపెద్దకొండగడిని
గీ. ప్రబలరణరంగజయభేరిభాంకృతుండు
రాయచేకోలుగండభరావిభుండు
రామ రఘురామ బలభద్రరామ నిభుఁడు
దీప్రబలుఁడై నగజరావు తిప్పఘనుఁడు.

## అనవేమారెడ్డి.

రెడ్డిరాజులలో నీతఁడు విఖ్యాతబలపరాక్రముఁడు. క్రీ 1370 ప్రాంతముల నున్నవాఁడు. రెడ్డిరాజ్యమునకు నద్దంకి రాజధానిగా నుండఁగా నీతఁడు క్రొత్తగాఁ గొండవీడుదుర్గమును గట్టించి తనకు రాజధానిగాఁ జేసికొ

న్నాఁడు. "కొండవీడుం రాజధానీం సవిచిత్రా మకల్పయత్। దృష్ట్వా తృష్టాఽపి నైచిత్ర్య మథూ ద్యస్యా స్సవిస్మయః"—ఈతఁడు వెల్గోటి వెలమరాజులతోఁ బోరాడి రాజ్యమును బెంపువెలయఁజేసినశౌర్యశాలి. ఈయన నవరాజధానీ ప్రశంసాత్మకమగు సమస్య:—

ఉ. వ్రేటుననె కాలుతునక్కలుగ వేయఁగ జాలినరాయరాతులున్
బోటరులైన వీరభటపుంగవు లోయన వేమభూప! నీ
వీటను గల్గియుండఁగను విగ్రహ లెంతటివా రెదుర్పఁగా
ఘోటకహాటకప్రకటకుంజరఘాటికిఁ గొండవీటికిన్.

ఉ. కాటమరెడ్డివేమఁ డవఘాటమహోద్భటచండఖడ్గుఁడై
కాటమ కేనికోట గొని గౌతమవాహిని దాఁటిపోయి యా
కోటల నున్నరాసుతుల కోమలులన్ దగఁ గొంచువచ్చెఁ బో
ఘోటకహాటకప్రకటకుంజరఘాటికిఁ గొండవీటికిన్.

ఉ. ఘోటకభోటహాట కురుకొంకణసింధుమరాటలాటక
ర్ణాటకళింగవంగ ద్రవిళాంగ విదేహకరూశదుర్గముల్
సాటియె యన్నవేమవిభులావిభుఁ డేలినదుర్గమైన యా
ఘోటకహాటకప్రకటకుంజరఘాటికిఁ గొండవీటికిన్.

ఉ. ఎత్తినబీర మొప్పఁ గడునేపున వేమయయన్నవేముదం
డెత్తినవార్త విన్నఁ బరువెత్తుతలంపులె యెత్తుఁగాని మా
మెత్తను జెప్పలెత్తగొడుగెత్తఁ బతాకము లెత్తఁగా మనం
బెత్తద తత్తరంబు మెయి నెత్తినభీతి నరాతికోటికిన్.

శా. భద్రత్యాగగుణాయురాహవకళాప్రస్ఫూర్తిఁ గోదండసం
పద్రేఖాకృతి నన్నవేమనృపతిన్ భాషింతు నీభూమి నే
భద్రేభాంతకు భానుపుత్త్రు భరతున్ భాషాప్రియున్ భార్గవున్
భద్రున్ భాను భగీరథున్ భవసుతున్ భంగోద్భవున్ భావజున్.

క. విని చెప్పనున్న దోషం
బని చెప్పినఁ గొంకెమందు; రది యెట్లన్నన్
నినుఁ బొంది కీర్తికామిని
యన వేమనృపాల! దెసల కరిగెను జుమ్మీ.

సీ. వీరనారాయణవిభుఁడు గొల్లెనయెత్తె
నేనంక దాడిగా నేఁగువాఁడొ
రాజవేశ్యావిటరాజు తేజీ నెక్కి
వాహ్యాళిగా నెందు వచ్చువాఁడొ
జగనొబ్బగండండు సరస బంటులఁ జేర్చి
నేకోటఁ జుట్టుకో నెన్నినాఁడొ
కలియుగబేతాళఘనుఁడు ఖడ్గముపూనె
ధరలోన నెవనికై తలఁచినాఁడొ

గీ. ఎఱుఁగరా దని వేగరు లెఱుఁగఁ జెప్ప
నీదుశాత్రవబలములు నిద్రలేక
తివిరి జడిసిరి నీఖడ్గతీవ్రఘాటి
నతనుసమరూప ! అనవేమనాఖ్యభూప!

సీ. పావకపరమేష్ఠి పవనపారావార
పాకశాసనులు నీపాటివారు
కందర్పకాశ్యపీ కమలాధిపతికర్ణ
కాలకంధరులు నీకరణివారు
యామినీశయయాతియాదోధిపతి యక్ష
యమతనూభవులు నీయంతవారు
తపనతాటకవైరితాలాంకతారాద్రి
తారకాంతకులు నీతరమువారు

గీ. శుద్ధి మతిరయగాంభీర్యవృద్ధిరూప
శాంతికరుణా వితరభూతికాంతిభాగ్య
సార ధనధర్మ తేజో లిశౌర్య ధైర్య
భుజబలంబుల ననవేమభూపవర్య.

సీ. భరతభాషారాబ్ధి దురభీష్మభుజగాధి
భూభేశభై ముల సొల్పువాఁడు
మధుమారమిహిర మీనధరముగ్గురమూర?
భిన్నర మైత్రుల షేర్మివాఁడు
శరశాక్ర శిబిశిక శుకశూక
శేషశై నేయుల సెలవువాఁడు
కరికాలకికికీల కురుకూలకొసకేస
కైటభారాతుల కరణివాఁడు

ఉ. భారణిరాణివాసి నని తా ననుచున్నది యన్న వేముతో
మారుప భుక్కులాధిపుని మానఁగఁగారణ మేమికల్గెనో
— — — నారిరైనయా
నారికి నారియైనఁ బరనారులు నన్వరె మజ్జగబులన్.

క. ఏపనికిఁ దగినమనుజుని
నాపని కనుపంగలేక యవనీశుఁడు దా
నోపనిమనుజునిఁ బంపిన
నాపని దాఁ జెటిచివట్టు లనవేమనృపా.

## పెదకోమటి వేమారెడ్డి.

ఈయనకు సర్వజ్ఞచక్రవర్తి యని బిరుదు. అమరుశతకవ్యాఖ్యాసాహిత్యచింతామణ్యాది కృతుల కీయన కర్త. శ్రీనాథకవిసార్వభౌముఁ డీయన యాస్థానమున విద్యాధికారి. క్రీ. శ. 1404 మొదలు 1420 వఱకు నీఁతడు రాజ్యపాలనము చేసినాఁడు.

సీ. కపటకంఠీరవాకారసారాయణ
క్ష్వేళానినాదంబు గేలిసేయు
కల్పాంతదుర్దాంత కాలభైరవభేరి
ఘుమఘుమోన్మాదం బడంగఁ జేయు
ప్రళయకాలాభీల పటుఘోరనిర్ఘాత
పటుపుటారావంబుఁ జటులపఱచు
మహానామమహాకాల కోలాహలోత్తాల
పాతాళనినదంబు భంగపఱచు
గీ. గండు మెఱసినరిపుకోటిగుండె లవియఁ
జండగతి మ్రోయునీరణోద్దండభేరి
జయరమాసంగ! రాయవేశ్యాభుజంగ
అతులబలధామ! పెదకోమటన్న వేమ.
సీ. కానీనకాకోక కానీనకాకోక
కానీన కాకోకకాద్రవేయ
కాద్రవేయాధర్మ కాధవేయాధర్మ
కాద్రవేయాధర్మకాలకాల
కాలకాల ప్రాంగకాలకాలప్రాంగ
కాలకాల ప్రాంగకారకార
కారకారగ్రాహ కారకారగ్రాహ
కారకార గ్రాహగ్రాహగాహ
గీ. గాహగాహను గాహనుకైనధూమ
ధూమనాటీక నాటీకదురభిమాన
నవ్యగుణలోల! సంగడిరక్షపాల!
అమితగుణధామ! పెదకోమటన్న వేమ!
చ. ధరణియె బొమ్మరిల్లు వసుధావరపంక్తులు బొమ్మలంబుధుల్
గుఱుగులు చక్రవాళగిరి కోట నభం బది సేసకోర ని

ర్జగిరి గద్దెపేఁట యినచంద్రులు మేటినివాళిపల్లెముల్
గురుతరపుణ్యుఁడైనపెదకోమటివేమనకీర్తికాంతకున్.

సీ. ఆచెంప నుద్దండ? (అచ్చంవువుద్దండ?) అనవేమపురమును
 గ్రామంబు తోరణకట్టిరేని
ధరణికోటనుగల్లు ధనధాన్యవస్తువు
 లరికట్టుకొని చూఱలాడిరేని
మునుకొనియభిమానముద్ద (?) భక్షింపంగ
 సారెకుఁ జేతులు చాఁచిరేని
అభ్యంగనము సేయ నన్నగారికి [నన్న వేముకు] చెప్పు
 నూనెలో చెప్పులు నూటిరేని

గీ. కణఁగి శత్రులు [విప్రులు] సేయునాఘాత్యమునకు
నోర్చియుంటివి నీసాటి యుర్వఁగలఁడె
[ఓర్చికీర్తులు గాంచితివుర్విలోన
నెన్నరాజులు సాటిరా రెవ్వరైన]
సమదరిపువీర రాజవేశ్యా భుజంగ!
అతులబలభీమ! పెదకోమ టన్న వేమ!

## కాటయ వేమారెడ్డి.

ఈతఁడు కాళిదాసునాటకత్రయమునకు వ్యాఖ్యాత. కుమారగిరిచేఁ గొండవీటిరాజ్య మేలించినవాఁడు. “నప్తా కాటయశౌరేః పౌత్రో మారస్య కాటనృపసూనుః। వీరాన్నపోతనృపతే ర్జామాతా జయతి వేమభూపాలః”:— ఈయనభార్య, కుమారగిరితోఁబుట్టువు. కుమారగిరి తనయవసానకాలమున నీత నికి రాజమహేంద్ర ప్రాంతదేశమును పారితోషికముగా నొసఁగి యక్కడికిఁ బంపినాఁడు. తనయేకపుత్త్రుఁడు మృతినొందఁగా నీతఁ డారాజ్యమును దన యల్లుఁడగు వీరభద్రారెడ్డి కరణముగా నొసఁగి యాతనికి బాసటయై యక్క-

డజీవితశేషమును గడపెను. కుమారగిరి యనంతరము కొండవీటిరాజ్య మేలినపెదకోమటి వేమారెడ్డి కీయన విరోధి. పెదకోమటివేమునికిఁ జెల్లఁదగినరాజమహేంద్రరాజ్యము నీతఁడు పడయుట విరోధకారణము. శ్రీనాథుఁ డీతని ఁమనుతుల్యుఁడ' ని ప్రశంసించెను.

ఉ. మానుషదానమానబలమానితధర్మర మామనోజ్ఞ శే
ఖానుతభూతివిత్తములఁ గాటయవేమనఁ బోలు వాసవిక్
వానివిరోధి వానివిభు వానివిపక్షుని వానియగ్రజుక్
వానిమఱంది వానిసుతు వానియమిత్రుని వానిమిత్రునిక్.

ఉ. ఓలి నరాతులం దునిమె నుగ్రతఁ గాటమరెడ్డివేమభూ
పాలుఁడు రాక్షసత్రిపురభంగము చేసిన భీమురీతి, నా
కాలపుఁ బాధ్రువైఖరి జగంబును జాల నుతించుచుండఁగా
నాలిపరాభవంబునకు నంబుధి గట్టినరాముకైవడిన్.

## అల్లయ వేమారెడ్డి.

శ్రీనాథుని కాశీఖండము కృతిగొన్నవీరభద్రారెడ్డి కీతఁ డన్న. భార్యమూలమునఁ దమ్మునికి వచ్చినరాజమహేంద్రరాజ్యము నీతఁడు నిర్వక్ర పరాక్రముఁడై పెంపొందించినాఁడు. క్రీ. శ. 1440 ప్రాంతములదాఁక నీతఁడు కలఁడు. ఈతనిపయిఁ జెప్పఁబడినపద్యములు పెక్కులు శ్రీనాథకవీశ్వరునివి:-

సీ. వివిధవిద్యోద్దండ విద్యుత్కుముదకాంత
హరిణాంక! రూపనారాయణాంక!
నీతోగ్రకరవాల నిర్జితారినృపాల
సప్తాంగ! రాజవేశ్యాభుజంగ
సకలమహీరాజ్య సంరక్షణోద్యోగ్య
కులశీల! సజ్జనదళవిభాళ
భామాజనస్వాంత పరితోషణలతాంత
కోదండ! రాయచేకోలుగండ

క. జయవిజయ జన్యకాంభోజ హయసమాజ
ఖురవిపాటన సంభూతకు తలరేణు
పటలనిబిడఘనధ్వాంతభరితభువన
విజయరఘురామ! అల్లాడ విభునివేమ!

సీ. కుందేందుమాళిపైఁ గలహంసపాళిపైఁ
గర్పూరధూళిపైఁ గాలుద్రవ్వు
మిన్నేటితెలపై మించుతామరలపై
మహిమంచునుజలపై మల్లరించు
జంభారిగజముపైఁ జంద్రికారజముపైఁ
జందనధ్వజముపైఁ జౌకళించు
ముత్యాలసరులపై మొల్లక్రొవ్విరులపై
ముదికల్పతరులపై మోహరించు

గీ. వెండిమల యెక్కి శేషాహి వెన్నుఁదన్ని
తొడరి దుగ్ధాబ్ధితరఁగలతోడ నలరి
నెఱతనంబాడి నీకీర్తి నిండె నహహా
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

సీ. దండయాత్రాఘోషతమ్మటధ్వనులచే
గంతులు వేయించెఁ గన్నకొండ
కితనకాలాభీలకీలానలముచేత
నేలపాం గడఁగించెఁ బాలకొండ
? అరట్టజాఘట్టహయఘట్టనములచేత
మట్టితూర్పెత్తించెఁ బొట్టునూరు
భూరిప్రతాపాగ్నిఁ బుటములు పెట్టించె
విద్వేషు లనఁ గొండిపురము

గీ. అనఁగ నుతికెక్కె తౌర కేళాదిరాయ
యరులసందునమందు వాయనవహరణ
బళియఘాళియమాళువబందికార
విజయరఘురామ! అల్లాడవిభునివేమ!

## వీరభద్రారెడ్డి.

శ్రీనాథకవి కాశీఖండము నీతఁడు కృతిగొనెను. రాజమహేంద్రము రాజధానిగాఁ గృష్ణానద్యుత్తరతీరమునుండి చీఁకటి, చిల్కసముద్రములదాఁక రాజ్య మేలినవాఁడు. ఈయనయన్న యల్లయవేమారెడ్డి బహుసమర్థుఁడు. కొండవీడు రాజధానిగా నాంధ్రదేశ మేలినపెదకోమటివేమారెడ్డికి వీరువిరోధులు. పెదకోమటివేమారెడ్డియుఁ దత్పుత్రుఁడును స్వర్గస్థులయిన పిదప శ్రీనాథుఁడు వీరి యాస్థానమునకుఁ జేరెను. ఈయన పద్యములందును గొన్ని శ్రీనాథునివి కలవు.

సీ. జయ రాజవేశ్యాభుజంగాంక నిశ్శంక
యభ్యుదయంబు రాజాధిరాజ
మంగళం బానతి మండలీకరగండ
సంకల్పసంసిద్ధి సమరవిజయ
బ్రహ్మరాసు నరిరాయబసు వశంకరముద్ర
నర్థిల్లు గాయగోవాళ బిరుద
మహిమించు రిపుచెంచు మలచూఱకారాఁక
స్వస్తి కర్పూరవసంతరాయ
గీ. ఆంధ్ర — — —సింధు యవనచేది
వీరలక్ష్మీస్వయంవర వీక్షణాఢ్య!
ధరణి పాలింపు మాచంద్రతారకముగ
విక్రమోన్నిద్ర! యల్లయవీరభద్ర!
సీ. వృద్ధకచ్ఛపరాజు వీఁపు భగ్గనఁ దన్ని
ఫణిసార్వభౌమునిపడగ లెన్ని

ధరణీస్థలముఁ ద్రొక్కి గిరులెక్కి నరవార్త
వరుసతో నంభోధివరులఁ జూచి
అనిలమార్గము దాఁటి యినమండలము దూఁటి
శశిదూటి నక్షత్రసమితిఁ గేటి
ఘనశింశుమారచక్రముఁ ద్రిప్పియతాలి
భవు మించి గోలోక శివ మసంచి

— — —

గీ. పూర్ణవిధుగాత్ర నీయశోంబురుహనేత్ర
జగము లన్నియు దానయై సంచరించె
విమతలయరుద్ర! యల్లయవీరభద్ర!

గీ. భద్రమరుత్ప్రియాణగుణ పౌరుషదానవినీలిశౌర్యసం
పద్ధిమప్రశస్తిగుణవర్ణితుఁ డల్లయవీరభద్రుఁ డా
భద్రకభద్రభద్ర గజభద్రక భద్రకభద్రభద్రక
ల్పద్రుమ వీరభద్రబలభద్రసముద్రసురాద్రి భద్రులన్.

శ్రీకృష్ణరాయలు.

ఈక్రిందిసమస్య లొల్లలక్ష్మీధరపండితునిచేఁ బూరింపఁబడినది. ఈతఁడు కృష్ణరాయనియాస్థానవిద్వత్కవి.

శ్లో॥ శ్రీకృష్ణక్షితిపాలదత్తమణిభిర్విద్వత్కవీనాంగృహా
నానారత్నవిచిత్రకుట్టిమభువో రత్నాకరత్వం గతాః
అబ్ధిః కేవల వారిపూరనిలయ స్సంభావ్యతే సజ్జనై
రంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః.

ఇదే సమస్యకుఁ బ్రాచీనతరమగు వేఱొకపూరణము:—

శ్లో. అంబా కుప్యతి తాత! మూర్ధ్ని నిహితా గంగేయముత్సృజ్యతాం
విద్వన్ షణ్ముఖ కాగతి ర్మయి చిరంతస్యా స్థితాయా వద!

రోషోత్కర్ష వశా దశేషనదనైః ప్రత్యుత్తరం దత్తవా
సంభోధి ర్జలధిః పయోధి రుదధి ర్వారాన్నిధి ర్వారిధిః.

సీ. చెడిపి రాలొత్తినయడుగుఁదమ్మలకును
గట్టుపయ్యెదఁ జించి చుట్టకొనుచు
బయలైనకుచకుంభపాళులకును జంటి
శిశువుల మాటుగాఁ జేర్చుకొనుచుఁ
గసుగందులకువడగాలికిఁ జాటుగాఁ
గచభరంబులు విప్పి కప్పుకొనుచు
వీడినతురుమునీవియఁదాఁక సడలించి
చేలాంతముఁ ముసుంగు చేర్చుకొనుచు

గీ. ఖానమల్కావజీరులమానవతులు
పాటుపరువున నీవు కల్బరిగగొనిసఁ
బ్రమసి దెసచెడి నలుగడఁ బఱతురౌర!
ఆహవోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!

మ. ......రితివేమికృష్ణతతి దేవా! కృష్ణరాయక్షమా
తలనాథుం డనివారితాన్న మిడఁగా. దద్బ్రాహ్మణాపోశనం
బులకుంబోయి సముద్రజీవన; మిడంబూరించునారాజు ని
ర్మలితాన్నో దకదానధారల విచారం బేల ప్రాణేశ్వరీ!

మ. నరసాధీశ్వరుకృష్ణరాయజగతీనాథా! భవత్కీర్తికిన్
సురకల్లోలిని వీఁగి భర్గునిజటాజూటంబుఁబ్రాపించె నా
హరుఁ డవ్వాహిని వార్ధిముంచుట భయస్వాంతాంగుఁడై పూనె నా
కరిజర్మంబు కపాలముల్ భసితముల్ ఖట్వాంగముల్ శూలమున్.

సీ. అమితప్రతాపబాలార్కవిస్ఫూర్తిచే
నదనగోల్పడియె నయ్యుదయశిఖరి

ఢేంకీధణంధణాఘోర నాదములచే
 వినుకొండ దుర్గంబు విరిగిపడియె
వాహినీసవుతాబు (?) వాహాముఖంబురా
 లెక్కయై కరగె బెల్లంబుకొండ
క్రూరరాహుతఖడ్గకులిశధారలచేతఁ
 గొలసి చెట్లునగట్టెఁ గొండవీడు
గీ. కూలె బెజవాడ కంపించెఁ గొండపల్లి
పగిలెఁ గటకంబు గగ్గోటపడియె ఢిల్లి
ఏకధాటిగనీవు దండెత్తినపుడు
కీర్తిలోపాయధౌరేయ ! కృష్ణరాయ !

పూసపాటివారు.

ఉ. ఆయతకీర్తి సజ్జనకులాగ్రణి మాధవవర్మ చింతలం
గాయలుకోసి యమ్మకొను కట్టెలగుండతనూజుచావుకై
శ్రీయుతుఁడైన పుత్త్రి తలచేతికినిచ్చె బెజాడవాడె నా[?]
పాయక నిల్చె పార్థివశిబాణశకాబ్దములైనకాలమున్.
ఉ. కట్టెలగుండి...కట్టెదురకై దసపట్టిఁ దెచ్చి య
ప్పట్టునఁ జంపెఁ చిత్రమని భర్గుఁడు మెచ్చి సువర్ణవృష్టియ
ప్పట్టణభూమిలోఁ గురియఁ బంచెను మాధవవర్మ పాడి పెం
పెట్టిదొ యంచు నింద్రుసభఁ జేర్కొని రప్పుడు దేవసంఘముల్.
సీ. చినుకుకుఁజినుకెత్తు కనకంపువర్షంబు
 నేరాజు కురిపించె నేడుగడలు
దురితవిదూరుఁడై దుర్గజగన్నాథు
 మెప్పించె నేరాజు మేదినందు
గరువంబునకు బోయనరుఁ బన్నిశిశు...
 తనశిశుఁ జంపెను......

చతురంగబలములు శక్తితో సంధించి
పగతుఱ నేరాజు పఱపినాఁడు
గీ. భానుసంత్యుండు సహకారబాంధవుండు
ధర్మపాలుండు తను...తాతతండ్రి
పొసఁగ నెవ్వారు నీసాటి పూసపాటి
రాజకులదీప! ఉద్దండరాచమాన!
చ. ఎనిమిదివేలదోరగలయేనుఁగులుఞ్ ఇడి నేలద్రొక్కి త్రొ
క్కనిదళలక్షవాజులును గాలుఁడు పోసి
ఎనయఁగ దుర్గ యిచ్చె ధన మిద్ధధనంజయభీకరాంకుకుఞ్
మనుజవరేణ్యతం బరగుమాధవవర్మకు గౌరవంబునఞ్.
సీ. మత్తఖండాపూని మ్రాకులు తెగమొత్తి
మెఱయుమన్నీలకు మిండగీఁడు
పూని గంతులువేసి బోరునవార్చియు
మురియుమన్నీలకు మూఁకవిప్పా
కోపించి నడివీథి గుఱ్ఱంబుదట్టించి
వదరుమన్నీలకు వలపు విటుఁడు
వనితలముందఱ వన్నెలుపెట్టుక
నిక్కుమన్నీలకు నెత్తిపిగుడు
గీ. అనుచు నర్థులు దిక్కుల నభినుతింప
వీరవిక్రమవిఖ్యాతి వెలసి తౌర
మన్నెసుల్తాన శాత్రవమానభంగ
వినుతనారాచ! చినతిమ్మ విభునిరాచ.
సీ. మనసు లొంగని వైరిమన్నె పేరంటాండ్రఁ
గదనాన గర్భాలు కలఁగమోదుఁ

గంటగించెడు మన్నెకొంటె భూపతులాంధ్ర
వెస నర్థికోటికి వెచ్చపెట్టు
లజ్జాభిమానంబు లఁజ్జగించెడుమన్నె
కూటులంజెలచుంచు కోసివేయుఁ
దొడ[illegible]రిపుమన్నె దుక్కిటెద్దులఁ గాంచి
కరకరినదలించి కసవుమేపుఁ
గీ. జెడుగుగుల్లాపుమన్నీలఁ జెండియాడు
విధనగుల్లాపుమన్నీల వెన్నుఁజఱచు
భూనుతాటోప గుణపేటి పూసపాటి
రాచవిభుతమ్మ! ఉద్దండరాచమాన!
క. కరకరి తమ్మయరాచం
దఱిముఱి తురగంబు నెక్కి యాజిఁ గృపాణిన్
బఱవన్ విడిచినంత నె
మొఱవెళ్లు నరాతిరాజ ముఖ్యులవీళ్లన్.
క. మన్నెసుల తానుబిరుదం
బెన్నఁగ గజరాజువీట నెన్నఁగఁదామున్
మన్నీలమనుచు నచ్చినఁ
దన్నును నీగొడుగువాఁడు తమ్మయరాచా.
సీ. హేమాచలముదాఁక నేకఛత్రంబుగా
భువియేలె మీతాత బుద్ధవర్మ
మీతాత కురియించె మెఱసి మాధవవర్మ
గరిమతో బెజవాడ గనకవృష్టి
పాండ్యకేకయచోళ పరవీరబలములఁ
డెగటార్చె మీతాత దేవవర్మ

పిడుగుమ త్రియముగా నడి నేసె మిాత్రాత
భీకరంబుగఁ జికభీమనృపతి
గీ. చండవిక్రమ! ఘనవంశజలధిచంద్ర
బాపు! నగధీర రణరంగ భైరవాంక
పోసఁగ నెవ్వారు నీసాటిపూసపాటి
రాచవిభుతమ్మ! ఉద్దండరాచమాన!
మ. అతిశౌర్యంబెగు పూసపాటికులరాచాధీశు తమ్మయ్యను
న్నతిగావించుచు నాశ్రయింతు రిల కర్ణాటీ పరిచ్ఛేదికా
కితకోటప్రభులాత్మబాంధవతనో గెల్వంగలేకో మహా
చతురుండంచునొ ఖద్వీపాగ్నిశశభృచ్ఛాకాబ్దకాలంబులన్.
ఉ. కొండలురాజు లప్పనము గొమ్మనియియ్యఁగ బంధువర్గమై
కొండలు గొల్వఁజేర్చ నడివి కొండలు మ్రొక్కఁగ నూడిగంబులన్
ముందటఁ గొండలుంబిరుదు మ్రోయఁగ రాజుల పూజలింగమై
యందున మించె రాచమనుజాధిపుతమ్మన రాజమాత్రుఁడే.

వత్సవాయ వారు.

ఉ. అరయ వత్సవాయ తెలగాధిపనందన నారసింహ! మిా
ద్వారము గర్వితాహితవిదారము సత్కవిబంధురక్షణో
దారము సత్యశౌచనయధర్మవిచారము కామలోభవి
స్తారనివారమున్ సఘనచారము దైన్యనివార మార్గఁగన్.
క. రాచర్క మనఁగఁ జందెపుఁ
బోఁచా మటి రిపులగెలిచి భూనుతకీర్తిన్
యాచకుల కియ్యఁగలుగు టె
రాచర్కము వత్సవాయరామనృపాలా!
మ. ఇతఁడా రంగదభంగసంగరచమూహేతిచ్ఛటాపావకో
ద్ధతకీలాకలభాయమానరిపురాడ్డారాశ్రుధారానదీ

నతరంగిణ్యబలాసమాగమసమానంపత్ప్రయోధస్తుతా
యతశౌర్యోజ్జ్వలుఁడై నవత్సవయరాయక్ష్మావరుం డీతఁడా!

మ. మహి నానందనృపాలుఁ శ్రీవిజయరామస్వామివా ల్లోకినూ
ర్ద్రిహుసేన్ ఖానునిమస్తకం బనిమొనన్ రెం డయ్యె రెండయ్యెన
వ్యాహారిద్ఘోటకమండలం బపుడు రంభాకంచుకగ్రంథియున్
రహి రెం డయ్యె జనానులాపమునకున్ దప్పేది వేఁటాఅనన్.

ఉ. తేఁకువతోడ వత్సవయతిమ్మజగత్పతిప్రాపుసేరితిన్
రాకు దరిద్రమా యిఁకఁ బరాకునసైన గిరాకునసైన నీ
పోకలు సాగ వింకఁ జెడిపోనక మాపగవారిఁ జేరుమా
దీకొనివచ్చితేని నినుఁ దిట్టక కొట్టక మాన నిమ్మహిన్.

క. డాబాలోఁ గూర్చున్నాఁ
డేబాలుఁడు ముద్దుగుమ్మ యెవ్వరె చెప్పుమా
చాబాషు నీ వచెఱుఁగవె
బాబాజీ బుచ్చితిమ్మబహాదరె చెలియా!

ఈకొండమనేఁడే రావుసింగమనేనియన్నమనేనిబాన.

సీ. చటులశాస్త్రసకోటిఁ జక్కఁగా నఱకవే
పిలిచి బిడ్డలపేర్లుపెట్టుకున్న
మత్తారిసంఘంబు మట్టిమల్లాడవే
పరతెంచిపదములఁ బడకయున్న
చెనఁటివిరోధులఁ జించిచెండాడవే
యెలమితోఁ గానుక లియ్యకున్న
గబ్బిపైరులఁబట్టి కసవుదిన్పింపవే
వేవేగ శరణంబుఁ వేఁడకున్న

గీ. గండభేరుండగండరగండబిరుద
గురుతరోద్దండపులియమార్కోలుగండ

శుభకరాకారకొండభూవిభుకొమార
దీపితాటోప! జూపలితిమ్మ భూప!

సీ. రభసంబుతో వైరిరాజన్యపక్షులఁ
గొట్టుటక్కులఁ జూపచుట్టుగాను
చటులారివరవీరచక్రవాకంబులఁ
జించు గోళ్ళను బటాపంచగాను
కపటశాత్రవ విహంగమకోటి శిరసులు
చెండు ముక్కున గంతతుండెములుగ
ఘోరవిద్వేషిశకుంతమాంసంబులు
భక్షించు వేడ్కతోఁ గుక్షినిండ

గీ. అపుర నీగండభేరుండ మహరహంబు
తిరిరి యారీతివిహరించు దిక్కులందు
శుభకరాకార కొండభూవిభుకుమార
దీపితాటోప! జూపల్లి తిమ్మభూప!

సీ. బిరుసైన నీగండభేరుండ బిరుదంబు
తమదన్నువాఁడు నీతమ్ముదిండి
పెంపైన నీగండభేరుండబిరుదంబు
పెట్టెడువాఁడు నీబెత్తవాఁడు
తీరైన నీగండభేరుండబిరుదంబు
గుత్తఁబూనువాఁడు నీగొడుగువాఁడు
పేరైననీగండ భేరుండబిరుదంబు
కోరెడువాఁడు నీకుంచెవాఁడు

గీ. మండలంబున గండభేరుండ బిరుదు
నీకె తగుఁగాక దూబమన్నీల కేల

భవ్యచారిత్ర ! కొండభూపాలపుత్త్రి
దీపితాటోప ! జూపల్లి తిమ్మభూప!

ఉ. మండితకీర్తి మీఱి జయమాఘచతుర్దశినాఁడు గండభే
రుండముఁదీసి క్రిందుపడి రూఢిని జెల్లకిరాయఁ డద్దిరా
కొండయతిమ్మనిన్ శరణుగోరెను జూపలివంశచంద్రు ని
మ్మండలమందుఁ గొండపలిమాన్యులు సాక్షిగఁగృష్ణసాక్షిగన్

క. గండర భేరుండబిరుదు
కొండయతిమ్మక్షితీశునకు భూషణమై
యుండె నల కనకశైలము
కొండుక పరిపంథిచాపగుడిసెలఁ గలదే.

క. కొలువక యిచ్చుట త్యాగము
కొలిపించుట యిచ్చుటెల్లఁ గూలిప నింతే
కొలువునకుఁ బసర మీఁదా
పొలుపుగ జూపల్లి కొండభూవరుతిమ్మా!

క. కొండపలిబయలు బిరుదులు
నిండిసవేడుకలఁ బెట్టి నీ కెదిరించే
లండీలఁ బట్టి ముక్కలు
చండుదు వచ్చోటఁ గొండజనవరుతిమ్మా.

సీ. కొండంతభుజశక్తిఁ గొండలు సాధించి
యవలీల గడికోట లాక్రమించి
పాడుపల్లెలు మేటిపట్టణంబులు చేసి
ఘనతటాకము లనేకములు నిల్పి
బహువనంబులు పెట్టి బావులు త్రవ్వించి
బాపలపెండిండ్లు పరగఁజేసి

భరతకట్టపఁ బ్రజాపాలనం బొనరించి
మఱియుశాత్రవకోటిమద మడంచి
గీ. భరితసత్కీర్తిచేత భూభార మెల్ల
నేలుచున్నాఁడు మతియును నేలఁగలఁడు
బలిమిఁ గనుపట్టి రామభూపాలుపట్టి
శ్రీవిశాలుండు జూపలిచెన్నఘనుఁడు.
క. ఏరున సింహాసమున
కేరీ పాలింప రాజు లిల సత్త్వమునన్
నేరుపునఁ గలిమిబలిమిని
ఘూరత ని న్నెన్ని యెన్న జూపలిచెన్నా.
క. అడపాలు కుంచె లరిగెలు
ముడిచెడఁగాఁ జింతకుంటము త్తఁడుచన్నీ?
తడఁబడుచు వేసి పాఱఁగ
సుడివడఁగా నొడిచితౌర జూపలిసింగా.
ఉ. శుభచరితాంగ లింగవిభుజూపలికొండలరాయభూప యా
రభటిని వైరిభూపులు దురంబున నిల్చియు నీఘమామి దా
గుభులు గుభుల్లటంచు నడిఘూర్ణిల మ్రోవఁగవారిగుండియల్
గుభలుగుభుల్లటంచునడిమూర్ణిలమ్రోవ నగుంబ్రతిధ్వనుల్!
చ. అరిబలభేది లింగవసుధాధిపుకొండలరాయచంద్ర సం
గరమున నిన్ను మార్కొనినగర్వితరాజకుమారకోటి భీ
కరముగ నీకరాసిఁ దెగి క్రిందుగ నాదివికేఁగున త్తఱిన్
సరసిజమిత్రమండలము జంతిగబిళ్లతెఱంగు దాల్పదే!
ఉ. కొండనృపాలుపౌత్త్రి నయకోవిద భోగజయంత లింగభూ
మండల

దండసమానరూప నిరతంబును నిన్నును బ్రస్తుతింతురా
కొండలరాయ వైరినృపకుంజర జూపలిశాసనోత్తమా!
ఉ. మండుసపండువాఁద్రవిశోమాలవమత్స్యవిదేహకాశభూ
మండలరాజమధ్యమున మచ్చికనెంతురు నిన్ను గండభే
రుండపద ప్రచండుఁడని రూఢిగ నర్థులు జువ్వికొండమా
కొండలరాయ నిన్ సుకవికోవిదరాయనిఁ బ్రస్తుతించెదన్

జూపల్లి వారు.

సీ. కలితధర్మజ్ఞానఘని ధర్మజుఁడు గాని
పరభయంకరభుజాబలము లేదు
పరభయంకరభుజాబలుఁడు భీముఁడుగాని
వివిధాస్త్రశస్త్రకోవిదత లేదు
వివిధాస్త్రశస్త్రకోవిదుఁ డర్జునుఁడుగాని
సతతదానకళాభిరతియు లేదు
సతతదానకళాభిగతుఁడు కర్ణుఁడుగాని
పరవంశసంగతత్వంబు లేదు
గీ. అనుచు . ధర్మజభీమార్జునార్కసుతులఁ
బరిహసింతువు ఘనధర్మబాహుసత్త్వ
శస్త్రపటిమ వితీర్ణిభాస్వత్కులముల
గురుతరాటోప ! జూపల్లి గోపభూప !
సీ. శ్రీకీర్తి రస్తు సంచితగండభేరుండ
బ్రహ్మాయు కరవాలభైరవుండ
అభివృద్ధి రస్తు రాహుత్తమువ్వరగండ
శుభమస్తు రాదివి [విళ?] చూఱకార
కుశలంబు దుష్టగోకులమానమర్దన
కటకహన్నిబ్బరగండబిరుద

శత్రుకక్షయోస్తు చేశ్వభక్తిపాకీణ
భద్రంబు నీకు విప్పర్లగోత్ర
గీ. ఆయురారోగ్య ముత్తమనాయకేంద్ర
అవుర సంకల్పసిద్ధి నీ కనుదినంబు
వైభవాకార! అప్పయ్యనరకుమార
రాజదేవేంద్ర! జూపల్లి రామచంద్ర!

సాయపనేనివారు.

సీ. అదిగో సాయపనేనియారట్టఘోట్టాణ
ఘాటికాఘోటికాదళితరజము
ఇదిగో సయ్యన ధీరహేలాఢమామికా
ధాంధణధాంధణధ్వనితరసము
అదె వచ్చెఁ జినవేంకటాద్రినాయకసింహ
బలుఁడు బాహాబలప్రౌఢిశాలి
ఇదె లగ్గపట్టించె నెట్టణ పలికొండ
ఘనదుర్గభటజనుల్ కడునడంకఁ
గీ. గినిసి మన్నీలు చూడంగ మొననిశాని
గరిమ నడపించి పలికొండఁ గట్టితోర
సమదహంవీరనిశ్శంకసార్వభౌమ
ధీరదేవేంద్ర! వేంకటాద్రిక్షితీంద్ర!

పెమ్మసానివారు.

సీ. జూటూరి ముండపు శూరత్వ మేర్పడ
రణభూమిలో సల్కురాజుగెల్చి
కోరి బేతముచెర్ల కోట ఘాళిగఁజేసి
చింతగుంట్రఘుపతిపంత మణఁచి

బెడగంటికయ్యానభీకరంబుగ నీవు
వెండియు సల్కాని విఱుగఁదోలి
సాహసుం డైనట్టిసహజియ్యాఖానుని
నదలించి యాదవ నంతలోన
గీ. త్రిమ్మ రైనట్టిసల్కాయతిమ్మవిభునిఁ
ద్రుంచి రాయలఁ బట్టాన నుంచితౌర
పృథుల గెల్పుల సురథాణి పెమ్మసాని
చిన్నవిభురామలింగ! తేజఃపతంగ!
సీ. మేలిమి తేజీలు డాలుదమామీలు
చికిలేలగోరీలు సింగిణీలు
ఖబ్బాయిఘట్టీలు కప్పురంపుసురటీలు
తులతేనిసైజాలు తోదుమీలు
చాఁకట్లజల్లులు జవ్వాదిపిల్లులు
తెలివిముత్తెపుఁ బేర్లు బలుగుడార్లు
పన్నీటిచెంబులు పైడికేడెంబులు
నందలంబులు జరాచాందవములు
గీ. కొల్లగొనివచ్చె నీమూఁక కొంకులేక
క్షితిఁ బ్రణుతధర్మ మృదుతరచేలభర్మ
సిద్ధగజకర్మ పెమసానిచిన్నతిమ్మ
వితరణగుణేంద్ర! భోగనిర్జితసురేంద్ర!
సీ. అభయంబొసంగుము హత్తుమువ్వరగండ
కావుము వాఁడిచేకండబిరుద
క్రోధింపకుము గండికోటదుర్గాధ్యక్ష
కరుణించు గండరగండబిరుద

తక్షించు గరుడనారాయణాంకవిహార
మనుప్రము శాస్త్రపదవిఫాల
నిగ్రహింపకును హన్నిబ్బరగండ చే
పట్టు గండరసూర్యభద్రచిహ్న
గీ. అనుచు నీచేతిహేతికి నడరి రిపులు
శరణుఁ బొందిరి భవదీయచరములకు
ధీర పెమసాని యక్కపార్థివకుమార
భోగదేవేంద్ర! చినతిమ్మ భూపచంద్ర!
సీ. వేలసంఖ్యలుగదా వినుతింప నీయాపి
స్థిరసత్యసల్లాప తిమ్మభూప
తనరు నశ్రీలమీఁదనె కదా నీధాటి
ధీరతరాటోప తిమ్మభూప!
మన్నెరాజుల కదా నిన్నుఁగొల్చినవారు
దేవేంద్రసమరూప తిమ్మభూప
రాయదేవుఁడె కదా రహిమించు నీకొల్వు
కమ్మవంశసుదీప తిమ్మభూప!
గీ. ఎంతమన్నీఁడ వౌరౌర యెంచిచూడ
గండరాదిల్య ముఖ్య ప్రచండబిరుద
భీకరాహవసేనాని! పెమ్మసాని
యక్కభూపాల చినతిమ్మ యలఘుధర్మ.
సీ. రమణ మాపెదతండ్రి రామలింగవిభుండు
మునురుపజీర్ల ను మెక్కపటిచె
మాతండ్రిపెదతిమ్మ భూతలాధ్యక్షుండు
దసూరిఖానుని మ స్తణంచె

మీాయన్న బళి చిన్ననాయకేంద్రుఁడు మస్త
ఖానుని బలము చీకాకుపఱిచె
అది విచారించి నీవశ్వరాయని బల
మడఁచవే జమ్ములమడుఁగు బయల

గీ. అహహ నీగెల్పు సెన్నంగ ననవిలోనఁ
దరమె శేషునికైన ముష్కరతురుష్క
మస్తకన్యస్త చరణ సమస్త శస్త
ననబిరుదసింహ పెమసాని నారసింహ.

## తిమ్మయ బుక్కరాజు.

సీ. పరవీరనరపాలశిరములు పొక్కిళ్లు
భద్రేభకుంభముల్ భాండసమితి
లలితప్రతాపానలం బగ్నికీలలు
కపటారిశల్యముల్ కాష్ఠసమితి
కడికండలై యుండు తురగాలుఖడ్గాలు
నిబిడారిసతుల కన్నీరుజలము
కుటిలారిమాంసంబు కూళ్లనుగూరలు
ప్రత్యర్థిరక్తంబు పానకంబు

గీ. ఇన్నియునుగూర్చి సమరోర్వి నిష్టమహిమ
నామెతలు పెట్టి భూతాళి కర్పితముగఁ
బ్రేమదళుకొత్త జయకాంత పెండ్లిగోరు
భోగసురరాజు తిమ్మయబుక్కరాజు.

## శాకమూరి నాయు.

సీ. శ్రీమించుమన్నియ శేఖరాధిపవర్య
శౌర్యగాంగేయ సౌందర్యమదన

సమదారిగజసింహ సర్వజ్ఞత్రిపురారి
పరశత్రుభేదన పరశురామ
సత్యహరిశ్చంద్ర నిత్యవైభవసాంద్ర
మానదుర్యోధన దానకర్ణ
పాకారిసమభోగ భానుసన్నిభతేజ
అద్రిధైర్య ... మానభద్రమూర్తి

గీ. నిన్నువర్ణింపఁగవులకు నేర్పు గలదె
శాకమూరన్వయాంభోధిశర్వరీశ
ధాటిరఘునాయక ప్రభు మేటితనయ
వైరిబిభ్రంహా! వేంకటనారసింహా.

సీ. దర్పితాహితరాజ దర్వీకరాళికిఁ
బరగఁబత్త్రిరథాధిభర్త యయ్యె
ప్రత్యర్థినరపాల భద్రేభసమితికి
సంహారవిక్రమసింహ మయ్యె
ధీరవైరికుమార త్రిపురసంఘమునకు
రౌద్రవీరావేశ రుద్రుఁడయ్యె
కుటిలారిపృథ్వీశకుల మేఘపటలికిఁ
బ్రళయకాలాభీలపవనుఁ డయ్యె

గీ. నీప్రతాపంబు వర్ణింప నెవరితరము
శాకమూరన్వయాంభోధి చంద్రబింబ
ధాటిరఘునాయకప్రభు మేటితనయ
వైరిజిద్రంహా ! వేంకటనార సింహా.

సీ. ప్రత్యర్థిమత్తేభపంక్తికి మృగరాజు
పరసర్పవితతికిఁ బక్షిరాజు
శాత్రవనీహారచయమునకు దినరాజు
అహితగోత్రాళికి సమదరాజు

దర్పితాహితపద్మదళములకు కుదురాజు
నభియాతిఘనులకు ననిలరాజు
పరిపంథిమారుతప్రతతికి నహిరాజు
నరివనంబులకు దావాగ్నిరాజు
గీ. అనుచు విమతులు నీధాటి నదరి బెదరి
యణఁగియుందురు శాకమూరన్వయేశ
గురుగుణోదార రఘునాయకులకుమార
వైరిజిద్రంహ! వేంకటనారసింహ,

మేదర మెట్లవారు.

సీ. కాల్బలంబులమీఁద ఖడ్గంబు వైవఁడు
రాయరాహుత్తుల వేయుఁగాని
రూఢి కెక్కినహయారూఢుల డాయఁడు
వీరసాహసులను డాయుఁగాని
వెన్నిచ్చిపఱచుభూవిభులవెంటాడించఁ
డెదిరించురిపులపై నెక్కుఁగాని
సామాన్యయోధుల సరకుసేయం డాజి
మించునెక్కుడుకాండ్ర ద్రుంచుఁగాని
గీ. వెఱచి పఱచినఁ గసువులు కఱచి మఱచి
గట్టులెక్కిన నరచినఁ గాచు రిపుల
బళిర మేదరమెట్లయాబళసుతుండు
మన్నెమాత్రుండె నరసన్నక్ష్మావిభుండు.
సీ. బాహాబలాటోపపటుగర్వముల మించు
కూటువమన్నీలగుండెదిగులు
ఆహవక్షోణిలో నరిసేనఁ బొడఁగని
పాఱెడు మన్నెభూపతులవిటుఁడు

పలుకుపంతము లొక్క భంగిగా మెలఁగక
యడరెడికొాదమనాయఁకులవుగఁడు
పాడవనిపోటును నిడనిత్యాగంబునై
యిలనొప్పమన్నీల యింటిభర్త
గీ. అతఁడు పువునూరిభువనవిఖ్యాతయశుఁడు
అతఁడు గజపతిరాజసాహాయ్యకర్త
అతఁడు సుల్తానగర్వసర్వాపహర్త
నారసింహుండు మేడరసరసవిభుఁడు.
సీ. గజపతిమన్నీఁడుకమలాక్షి! యితఁడఁటే
సఖి రాజవేశ్యాభుజంగుఁ డితఁడె
కోమలి! కోటలగొంగ యీతండఁటే
కాంత! రాచూరిదుర్గాపహరుఁడె
నారి! యీతఁడు పువునూరిసింహం బటే
అలివేణి! కొాదమనాయకుఁ డితండె
చెలియరో! సుపమాయిచిప్పా మీతండఁటే
అతివ! గగ్గోలురాయాంకుఁ డితఁడె
గీ. అనుచుఁ బౌరాంగనలు మహాహర్ష మొదవ
నొండొరుల హెచ్చరింపుచు సుందరహహ
బళిర మేదర మెట్లఅయ్యలకుమార
మన్నెదేవేంద్ర! నరసింహమండలేంద్ర!
క. కంటకపురిపులఁ బొడఁగని
గెంటుచు వెన్నిచ్చి పోక కినిసినయపుడే
బంట్లైనవానికల్లను
కంట్లై నిలిచెద నపుసకదరయ నరసా!

సీ. మాటాడితప్పెడిమన్నీల నేవేఁడ
భట్టునెన్నని లోభిషండుఁ బొగడ
వెన్నిచ్చుమన్నీని వినుతిసేయఁగ నొల్ల
కొలువెఱుంగనిమడ్డిఁ గొలువ నొల్ల
ప్రజ్ఞమీఱనిమన్నె బజగెల్లఁ బ్రణుతింప
నీలిచాలనిమన్నెనీచు నొల్ల
పరువెఱుంగని మన్నెవానిఁ గన్నులఁ జూడ
మహిని దుర్మన్నియమాటనెంచ
గీ. నిన్ను నీవంటిమన్నీల నెంతుఁగాని
ఆహవోద్దండ కొదమనాయఁకులగండ
వనధిగంభీర! అయ్యలవరకుమార
మేటిరణధీర! ... మేదరమెట్లనరస!

ఉ. బట్టును నేను కమ్మకులపట్టపురాజవు నీవు కావ్యవా
గ్ధట్టుఁడ నేను, శౌర్యనయధర్మవిదగ్ధుఁడ వీవు, నేల యీ
పట్టునఁ దొంటియట్టు నయపద్ధతిఁ బ్రోచికృపానిరూపముల్
మెట్టగదయ్య యయ్య! ఘనమేదరమెట్లనృసింహభూవరా!

సీ. విజయంబుగజపతినిజమన్నెధారేయ!
ఆహవోద్దామ కేశాదిరాయ!
పేరైనసురుమాయిబిరుదాంకమూర్ధన్య!
ప్రతిపక్షసంహార పరశురామ!
హంపీరపుచునూరిసింహాసనధురీణ!
గగ్గోలురాయ సంగ్రామభీమ!
ప్రకటకోటలకొంగ ప్రత్యర్థిమదభంగ!
జగదీశరాజవేశ్యాభుజంగ!

గీ. అనుచు సుకవులు ని న్నెంతు రన్నిదిశల
మిహిరసమతేజ మేదరమెట్లభోజ!
నారసింహార్యసత్పుత్ర! నవ్యగాత్ర!
గీతగుణసాంద్ర! రమణపృథ్వీతలేంద్ర!

సీ. దురములో రాచూరుదుర్గాపహరణాఖ్య
బిరుద మేమన్నె భూవరుఁడు చెంద
రణములో నేమన్నెరాజన్యుఁ డింపొందఁ
గౌదమనాయంకరవిదితుఁడయ్యె
బవరాన నేమన్నె భార్గవుం డెక్కుడై
గగ్గోలురాయాంకఘనతఁ దనరె
కదనాన నేమన్నె కంఠీరవుఁడు హెచ్చి
కోటలగొంగాఖ్యగురుతుమీఱె

గీ. నిన్నిబిరుదులు నీయంద యెన్నఁగలిగె
మిహిరనిభతేజ మేదగమెట్లభోజ
నారసింహాంక సత్పుత్త్రి నవ్యగాత్ర
పూతగుణసాంద్ర! రమణ పృథ్వీతలేంద్ర

సీ. సిరిమించుసురుమాయిబిరుదుమన్నెకుమార
భీమప్రతాప సంగ్రామవిజయ
గజపతిసామ్రాజ్యగజమన్నెసింహమ
కేశాదిరాయ గాంగేయశౌర్య
కమ్మకులాధ్యక్ష ఘనకీర్తివిస్తార
తమ్మలూరిసుగోత్ర దానకర్ణ!
సత్యహరిశ్చంద్ర నిత్యాన్నవరదాన
భటకవిసంస్తుత్య బంధుమిత్ర

గీ. మిత్రజనపోష మేదర మెట్లవంశ
జలధిసారంగ! లోభివేశ్యాభుజంగ!
మల్లభూపాలసత్పుత్ర మంజుగాత్ర!
భవ్యగుణగణ్య! కొండపప్రభువరేణ్య!

మాణిక్యరావువారు.

సీ. సుషమాప్తికాకల్ప సుప్రతీకంబుతోఁ
కంబుతోఁ బుండరీకంబుతోడ
పల్లవకుసుమ సంపాదనై కాంతులోఁ
గంతులో రోహిణీకాంతుతోడ
అధిగతపరమోగ్రుఁడైన స్వర్భానుతో
భానుతో నలచిత్రభానుతోడ
దండిగాండీవ కోదండాభిరాముతో
రాముతో నందనారాముతోడ

గీ. నీదుసత్కీర్తి నీమూర్తి నీప్రతాప
దీప్తి నీదోర్బల స్ఫూర్తి దీటుమిగిలి
యలరె మాణిక్యరాయవంశాబ్ధిసోమ
భాసురగుణాలి భాసభూపాలమాళి.

సీ. ఒకతాత కుతుబుశా ప్రకటదక్షిణభుజా
దండుఁడై కోవెలకొండ యేలె
నెలమి రెండవతాత యిభరాముపాదుశా
పంపునఁ బెదకొండపల్లె యేలె
మహిమించు ముమ్మడిమాణిక్యరాయఁడు
వినులి కెక్కినకొండవీటి నేలె
రాణించురఘుపతి మాణిక్యరాయండు
పరభయంకరవృత్తిఁ బరిఢవిల్లె

గీ. తండ్రికంటెను పెదతండ్రి తండ్రికంటె
తాతముత్తాతలకునెల్ల ఖ్యాతిదనర
వన్నెగంటి కృష్ణాసేనివంశమునను
నిర్మలోపాయ బళిర మాణిక్యరాయ.

సీ. దుర్గములోఁ గదిసిన దొరలశిరంబులు
ఛేదింప బలుదిట్ట నీడుపట్ట
కదనరంగమునందుఁ గదిసిన పరరాజ
నిచయంబులను దాఁకు నీదుబాకు
జన్యసంతోషులై చనుదెంచువైరుల
నిముసంబులో మ్రింగు నీదుచాంగు

గీ. సాటిదినీడాలు వైరులచుక్కవ్రాలు
బళిర నీ పౌరుషం బెన్నఁ బరము గాదు
అవని మాణిక్యరాజవంశాబ్ధిచంద్ర
రాజవేంకటగోపాలరాయభూప!

సీ. శ్రీకరవిజయలక్ష్మీవిరాజితవైభ
వేంద్రుండు సద్గుణసాంద్రమూర్తి
మాణిక్యరాడ్వంశమందారభూజంబు
పద్మనాయకమనఃపద్మహేళి
మన్నెకులోద్యానమధుమాసపైకంబు
కామినీమన్మథాకారవేషుఁ
సతిపుణ్యపరిగోత్రవితతాబ్ధిచంద్రుండు
డర్థిచాతకవార్షుకాంబుదంబు

గీ. అని జనుల్ మెచ్చఁ గీర్తిచే నలరె తహహా
చరితదేశాంత సత్కవీశ్వరనితాంత

వర్ణితస్వాంత! రేపల్లెపూర్ణి కాంతి
దీపితాటోప! వేంకటగోపభూప!

### అట్లూరి వేంగళన్న.

సీ. పరగధర్మాధర్మపద్ధతుల్ దిగనాడు
దుండగీఁడగుకమ్మ గుంప్లకమ్మ
అగణితవిఖ్యాతి నెగడ నేర్చినయార్థి
మన నెఱుంగనికమ్మ మాచకమ్మ
కడఁగినైరులమున మనఁచిపుచ్చఁగలేక
యడఁగియుండెడుకమ్మ యాకుఁగమ్మ

గీ. కమ్మలందఱుఁ గమ్మలా! కమ్మ లరయఁ
గమ్మలనఁ-గీర్తిఁ దెచ్చినకమ్మ వీవె
ప్రథితగుణహార! నారమాంబాకుమార
విక్రమోపేంద్ర! అట్లూరివేంగళేంద్ర!

### జల్లి అంకభూపతి.

ఉ. జల్లికులావతంస బలశాసనవైభవ యంకభూప నీ
సల్లలితైకకీర్తిరుచిజాలము మిక్కిలివన్నెపెట్టు జా
బిల్లికిఁ బాలవెల్లికిని భీష్మునితల్లికి నాణిముత్తెపుం
జిల్లికిఁ గల్పవల్లికిని సాగరగర్భనభూమతల్లికిన్

### కాళభూపతి.

ఉ. ఏమిదరిద్రమా! సుకవి యేమిర? పొమ్మ్రఁకఁ; బోకయుండినన్
నీమొన లేమిచేయు; నది నీవె యెఱుంగుదు వైనఁ జూడుమా
పామజకాళభూపతి కృపాంబుధిచే విలసిల్లుదానము
క్ష్మానిత హేమధారయనుఖడ్గముచే నఱికింతు ధీరతన్.

జగ్గరాజు.

ఉ. క్రొంచులవెంబడిన్ మునుపు కొన్నిదినంబులు సంచరించి నీ
యంచును వారి రోసి మహదాశ్రయ మంచును మిమ్ముఁ జేరితిన్
వంచకులైన దుష్ప్రభుల వాకిటికిన్ మగుడన్ జనంగ నా
కించుక బుద్ధి పుట్ట దిఁక నేమియుపాయము జగ్గరాణ్మణీ!

వేజెళ్ల — వేంకటకృష్ణరాజు.

మ. చెలఁగెన్ వేజెళసార్వభౌముఁడు జయశ్రీశాలి సింహాసన
స్థుఁ లో నేడవరాజు దిగ్విజయకీర్తుల్ వానివే వానితోఁ
గలహంబెప్పుడువద్దురా రిపునృపుల్ గర్వించి మార్కొంటిరా
పులితో లేళ్లు విహంగపుంగవునితోఁ బూరేళ్లు పోరాడుటల్.

నూజివీటి—యప్పారావు.

చ. వెలమకులంబునందు నిలువెల్లరు కాంత లటంచుఁ బల్కున
ప్పలుకు లబద్ధమయ్యెఁ గులపావనుఁ డీఘనుఁ డప్పరాయరా
డ్కులభము కీర్తికాంత కృతికాంత మహీజయకాంత యిప్పుడీ
కలిజగమంతటన్ దిరుగఁగాఁ గనుఁగొంటిమి చిత్ర మారయన్

వాసిరెడ్డి—వేంకటాద్రినాయఁడు.

సీ. లోకప్రతిష్ఠితోల్లుట్లనామకగోత్ర
పద్మపంకేరుహబాంధవుండు
వాసిరెడ్యాఖ్యాన్వవాయపారావార
శారదరాకానిశాకరుండు
రణరంగఫల్గున రాజజగన్నాథ
భూజానిసింహ తనూజవిభుఁడు
లక్ష్మీసతీతుల్య లక్ష్మీసతీగర్భ
శుక్తికానర్ఘోరు మౌక్తికంబు

గీ. కొండవీడాది వినుకొండ కొండపల్లి
బందరు నిజాముపట్టణ ప్రముఖరాజ్య
విభుఁడు జగదేకవీరుఁడు వేంకటాద్రి
నాయఁడు బహద్దరు ధరాధినాయకుండు.

సీ. శశిలోనిమృగము పచ్చలభిత్తికాంతులు
దూర్వాంకురము లని దుముకఁ జూచు
మలచినకెంపుపట్టెలఁ జూచి మదనుండు
తనమానికపుదోన తలఁచు వెదకుఁ
బవడంపుఁ జూరు కల్పకశాఖి చిగు రని
కామధేనువు మేయఁగా యతించు
వజ్రనీలస్తంభవర్ణముల్ శివవిష్ణు
తనువులెంచు నగాబ్ధితనయ లెంతు

గీ. శౌర నవరత్నబద్ధానుకారి ముకుర
నికరరుచి వేంకటాద్రీంద్ర నిరుపమాన
లలితకలిత సౌభాగ్యవిలాసనామ
సౌధవైభవ మగణితసరణి నొప్పు.

సీ. ఏవంకఁ జూచిన హేమకౌప్యాంచిత
స్తంభంబులకడింది తళుకులెసఁగు
ఎచ్చోటఁ జూచిన హెచ్చైనమృదుహేమ
పటచిత్రశయనోప బర్హణములు
ఏచెంతఁ గనుఁగొన్న నెంచి చెప్పఁగరాని
నిలువుటద్దపు నిగన్నిగలుగ్రమ్ము
ఏకడఁ గనుఁగొన్న నెంతొ వింతఘటించు
చిత్రవస్తుసమృద్ధి చెలువుఁజూపు

గీ. ఏదరినిఁ జెయ్యిసాచిన నెనసి చుక్క-
లందుకొనవచ్చు శ్రీవేంకటాద్రిమనుజ
రాణ్మహేంద్ర విలాసహర్మ్యంబు మహిమ
వర్ణనముసేయఁ దరమె యెవ్వారికైన.

క. ఇలఁగలనృపతులు నీతోఁ
దులదూఁగకయున్న నీవు తులదూఁగితివా
బళిబళి బంగారముతో
బలసాంద్రా! వేంకటాద్రి పార్థివచంద్రా!

మ. మరుగుల్ గొల్సులు చంద్రహారములు సమ్మోదోక్తినిద్ధంపుటుం
గరముల్ పోగులు పల్లకీలు హయసంఘం బగ్రహారంబులున్
మెఱయం జాలినసేలువుల్ ధనము నెమ్మిన్ వేంకటాద్రీంద్రుచే
తఱచున్ గొన్న బహుస్థితుల్ గలిగి విద్వాంసుల్ సుఖంబందరే.

గీ. వైభవోపేంద్రుఁ డైనట్టివాసిరెడ్డి
వేంకటాద్రీంద్రుఁ డొకపెండ్లివేళయందుఁ
బిన్నదొరలకు నత్తరుకొన్నకర్చు
పృథ్విఁ గలరాచవారికిఁ బెండ్లికర్చు.

శా. తేజఃకాంతివితీర్ణిభోగకరుణాధీసారతన్ బద్మినీ
రాజున్ రాజును రాజరాజు సుమనోరాజున్ నదీరాజు వా
గ్రాజున్ బర్వతరాజు మీఱితివి నీకా సాటి భూరాజు లో
రాజశ్రీయుతవాసిరెడ్డికులచంద్రా! వేంకటాద్రీశ్వరా!

క. వెన్నెలవలెఁ గర్పూరపుఁ
దిన్నెలవలె నీదుకీర్తి దిగ్దేశములం
దౌన్నత్యంబున వెలసెను
విన్నావా వాసిరెడ్డివేంకటనృపతీ!

సీ. దేవరకోటాఖ్య దేశాధిపత్యంబు
        గల్గి మించిన యేర్లగడ్డవారు
సేనాధిపత్యంబు చేతను మెప్పించు
        శూరవర్యులు శాకమూరివారు
అరయంగ నమవాసి ననుసరించెడు మంచి
        చేవచే మించెడు చేవవారు
కులగోత్రసంపద గలిగి రాజప్రీతి
        మెలంగినట్టి చిటుమామిళ్లవారు
గీ. మొదలుగాంగల బంధువుల్ మోద మలర
మన్నెసుల్తాన్ బహద్దరు మంచినృపుడు
మఱియు బంధుసముద్రుండు మానఘనుండ
టంచువర్ణింతు రెపుడు నాయనిపతిని.

సీ. దీపాలమిసిరవల్ తాంపినబంగారు
        టోపీ శిరంబందు నేపుచూప
రంగైనసీమ స్త రంగీజరీచెట్ల
        లుంగీ హొయల్ మీఱి చెంగలింప
సుజరాతికెంపులకూర్పు తిన్ననయొప్పు
        పల్వారుపై నవ్వుచెల్వు దనర
మేచారమునం బచ్చపోచీ కరంబదు
        మేల్మిజీఱలముద్దు లల్మికొనంగ
గీ. అరసిచిగురాకుం దరవాజు మరువజీరు
  ... ... ...

శ్రీవేంకటాద్రినాయనివా రొకదినమున "నందన" మనెడి యమరావతియందలి వారిస్వీయోద్యానంబున విహరించుచుండ ములుగు పాపయారాధ్యులవారు దర్శించి యీక్రిందిపద్యము చెప్పిరట.

సీ. సురసరిద్ధరిణరుగ్ద్విరదభిద్ధరకుభృ
ద్ధరళరచ్ఛరదర స్ఫురితకీర్తి,
హరిసఖస్వరుహరి ద్ధరికరోద్ధురభయం
కరశరోత్కరముఖ త్సరదరాతి
సురభికిన్నరకులేశ్వరసుతస్మరమరు
ద్వరజనుస్సురుచిసుందరతనుండు
తరణిభూశరదనిర్జరకురుట్సురగవీ
హరసఖామరమణీ వరవితీర్ణి
గీ. నృపతిమాత్రుండె యాశ్రితనివహపద్మ
భానుఁడై భూరిధీరతానూనరత్న
సానుఁడగు వాసిరెడ్డివంశప్రసిద్ధ
వేంకటాద్రిప్రభుండు రవిప్రభుండు.

: నాయనిగారు "తాతా! యిట్టియుద్యానవన మున్నందులకుఁ దగినఫలము లభింపదయ్యెను. ఇది మీబోఁటికవిశేఖరులకే యనుభవయోగ్యము గాఁదయ్యెను. సౌరభభరిత పుష్పగుచ్ఛము లెన్నియున్న నేమి ఫలము? మీముఁబోఁటి కవివరేణ్యులచే గండోపలప్రహారంబుల ననుభవింపవలసె" ననిరట. అంత పాపయారాధ్యులవా రీక్రిందిపద్యముఁ జదివిరట.

సీ. భములతో సురపాదపములతో గంగోద
కములతో నీహారకములతో సు
హేలితో నమరేంద్రకేలితో నైలింప
వీతితో పరమేష్ఠిసూతితో డ
నవ్వుతో విరిమల్లెపువ్వుతో జేజేల
బువ్వతో పలుకులయవ్వతోడఁ
శూలితో గూఢపాత్పాలితో మౌక్తిక
పాలితో సారంగపాలితోడ

గీ. మొల్లమున నల్లిబిల్లికై యెల్లజగము
నల్లుకొని నీయశోవల్లి యుల్లసిల్లు
శ్రీవిభాసితజగ్గభూభృత్తనూజ
వెంకటాద్రీంద్ర నృపచంద్ర విజయసాంద్ర.

క. జలజారికళలయందును
గలశాంబుధియందుఁ బన్నగప్రభునందున్
నెలరై యలరై తలరై
యలరెన్ నీకీర్తి వేంకటాద్రిమహేశా!

సీ. ధరణి నేవిభుఁ డద్భుతనభోజరా జంచు
విద్వద్గణంబుచే వినుతిగాంచె
నెరయ నేఘనుఁ డిదానీంతనరాధేయుఁ
డని రాజసభలఁ బ్రఖ్యాతిఁ గాంచెఁ
నేనృపుం డైదంయుగీ యార్జునుండని
శూరులచేతఁ బ్రస్తుతివహించె
నేమహాప్రభునర్యుఁ డిల నధునాతన
రుక్మాంగదుండని రూఢిమించె

గీ. నఖిలవిద్యాపరిశ్రమా త్యంతదాన
శౌర్యహరివాసరవ్రత చర్యలందు
నట్టిశ్రీవాసిరెడ్డివం శాబ్ధిపూర్ణ
చంద్రుఁడగు వేఁకటాద్రిభూ ప్రేంద్రుఁ డలరు.

మ. సురభూమీరుహపంచకంబున రమా సూనుండు నొక్కొక్కశా
ఖ రహిన్ గైకొని వాసిరెడ్డికులరాకాచంద్రుఁడౌ వేఁకటా
ద్రిరసాధీశుని పంచశాఖముగఁ గూర్చె న్నేఁడు మాకు న్మహే
శ్వరపూజాతిశయం బటంచు సురభూజంబుల్ ముదంబందెడిన్.

ఉ. సోముఁడు లేనిరాత్రివలె సూర్యుఁడులేనిదినంబురీతి శ్రీ
రాముఁడులే నయోధ్యవలె రాజకులేంద్రుఁడు వాసిరెడ్డి సు
త్రాముఁడు గానరాని యమరావతిపెంప ఱెఁ గాలమానముల్
గామవిరోధికిం గడనఁగాదుగదా మది శంక లేటికిన్.

ఈక్రిందిసీసము పాపయారాధ్యులవారు శ్రీవేంకటాద్రినాయనింగారి పిన తండ్రికుమారులైననాయఁడమ్మగారిపైఁ జెప్పినది:—

సీ. ఘనసారశరశశి ఘనసారసేశాప
ఘనసారమైయొప్పుఘనయశంబు
విక్రమార్కునిలోడ విక్రమింపగఁజాలు
శక్రాభనిర్వక్రవిక్రమంబు
కల్పభూమిజసం కల్పభూశతజన్మ
కల్పభూరిత్యాగ కాంతతాప్తి
రాజరాజనిలింప రాజరాజత్సుధీ
భాజనంబైనట్టి భాగ్యగరిమ

గీ. స్థిరతవిలసిల్ల వలెఁ బార్వతీసమేత
రామలింగేశ్వరకృపాభ రంబువలనఁ
బ్రకటతరరరరంహ వాసిరెడ్డి కులసింహ
నరులకల్పద్రుమపుఁ గొమ్మ! నాయఁడమ్మ.

## వాసిరెడ్డిరామనాథబాబు.

ఈయన వేంకటాద్రినాయనికుమారుఁడు. వీరికాలముననే వేంకటాద్రినాయనింగారార్జించిన ప్రాజ్యమగురాజ్యము యథాయథ లయినది.

సీ. సుల్తానుబహాదరీచూపించినలఖాబు
ఇచ్చవచ్చినలచ్చులిచ్చు జేబు
కయివారములుసేయు వికిచ్చుతసితరీబు
కాన్కుక్షీతోఁగూడు...కాబు

అలకాధిపతికైన నప్పు లిచ్చుదరీబు
చలపట్టి సేయువైరులఖరాబు
వాసిరెడ్డికులాబ్ధి వర్ధిల్లుమహతాబు
సర్కారు సారించుసరిజబాబు
గీ. జబరదస్తులకెల్ల దు(స్సానశాబు
కన్ను వేసిందిచూ తమ్మికంటిబూబు
ననసీహోల్లాసి మారామనాథబాబు.

## శ్రీధనంజయధాత్రీరాజు.

ఈతఁడు విశాఖపట్టణమండలమందలి పార్వతీపురప్రభువు. సంతుల బ్రహ్మయ శాస్త్రియను కవి యీతనిఁగూర్చి చెప్పిన పద్యములు:—
సీ. భటులకోలాహలార్భటుల గుండెలులుద్రీల
పుండరీకంబులు బెండుపడఁగ
బలువేఁటకుక్కల ఘాఘారవంబుల
నడవిపందులు గుండెలవిసిపడఁగ
తమకుపాకీవేట్ల ధనుధనంధనముల
క్షణములో మృగములగములుగూల
కెలఁకుల జనులెల్లఁ గేరి కేకలువేయ
జయజయధ్వని వందిజనము సేయ
గీ. వేట గావించితిరి వనవీధియందు
నర్జునపరాక్రమంబుచే నతిశయించి
మహితశ్రీవీరనములో ద్ర మల్చిరుడున
శ్రీధనంజయధాత్రీజ! క్షితివిభాజ.
సీ. సాగసైనరత్నాల జిగిగుల్కుమేల్తాజు
హాసుగా నౌదలవాసినింప

ముఖచంద్రు నిరుత్రేకేవ మొనయు కీర్తులపోల్కి
వజ్రాలచౌకట్లు వన్నె లోలుక
సుసకపీంద్ర రక్షణవిచక్షణ నేత్ర
రాజీవముల దయారసముగుల్క
సకలవనీ పక్షశ్రవణంబు లింపొంద
శుచిధామ మధురవాగ్రచన లెసఁగ
గీ. నలుత హారమంజిముత్యాలసరులు దనర
గంతుని జయంతు నలమహీకాంతు గెలిచి
వెలయుమిముఁ గన్నఁ గనులకు విందుగాదె
శ్రీధనంజయధాత్రీరాజ! క్షితిబిడౌజ.
సీ. నుదుటఁ బాపటబొట్టు పదనుకస్తురిచుక్క
మెడను గందపురేక మేల్మిసుంగు
సొగసుచెక్కులనింపు జుసపాలబలుసొంపు
మోవియందు బులాకిముత్తియంబు
పైఠిణీరైక క్రొంబట్టు కుచ్చులజడ
తళుకుతాళేదు జల్తారువాణి
మొలనూలుగంటలు జిలుఁగు పావంజీలు
మోమందుఁ జిఱునవ్వు మొలకలెత్త
గీ. రంగుమీఱంగ మదనసామ్రాజ్యలక్ష్మి
విధముగా వచ్చి కప్పురవిడియ మిచ్చి
కాఁగిటను గ్రుచ్చి బావిలీ ల్కదల మెచ్చి
మచ్చుకిచ్చిన ముద్దును మఱవఁ ద్దు,
గీ. పంతులపంళె బ్రహ్మకవి పార్థివ లోకలలామ! దేవిఙ్
చెంతకుఁజేరి దర్పవముఁ జేయఁ బ్రతీక్ష యొనర్చు చుండెన

త్యంతనయా రసార్ద్రిహృదయంబున సన్నిధిఁజేర్చునాజ్ఞ ద్వా
రాంతరవర్తి కిమ్ము సముదారధనంజయధాటరాణ్మణీ.

క. ననవలె ననవలె చెలువం
గనవలెఁ గనవలె మృదుత్వగరిమ మధురిమన్
ఘనమగు భవత్కవిత్వం
బనుపమతేజా! ధనంజయనృపబిడౌజా!

## మంత్రులు.

సీ. వ్రాయను జదువను నరుసతో మాటాడ
నానలీనలిపల్కు లాలకింప
పరదేశభాషలు ప్రభువుకు వినిపింప
సభదుర్గుణంబులు సర్దుచేయఁ
మనవులుగదియింప మనసులేకము చేయ
గపటనిష్కపటముల్ కలయ నెఱప
కలిపింప విడిపింపఁ గరుణింప మన్నింపఁ
బరనృపాళికిరాజ్యపదవిఁ దీర్ప

గీ. సభలఁగూర్చుండి చిత్రప్రసంగ మాడ
సరససంగీతసాహిత్యసరణి నెఱప
వినయగాంభీర్యచాతుర్యవితరణముల
నేర్పుగల్గినమంత్రులునీతిపరులు.

## దేవనారాయణామాత్యుఁడు.

శా. క్షిత్యాకాశదిశావకాశముల ముంచెన్ దేవనారాయణా
మాత్యగ్రామణికీర్తిచంద్రికలు ఝంపాతాళమానక్రియా
నృత్యద్ధూర్జటిజూటకోటరకుటీ ప్రేంఖద్వియద్వాహినీ
ప్రత్యగ్బుద్బుదవిశుద్ధఫేనపటలీపాటచ్చరప్రౌఢిమన్.

## రాయని భాస్కరుఁడు.

చ. కరములు వేయునుం గలుగఁగా ఫల మేమిటొ నర్చు భాస్కరుం
డరులను వేడుకొంచుఁ దిరుగాడును బంగరుకొండచుట్టు శ్రీ
కరుఁడగు భాస్కరేంద్రుకులగణ్యుఁడు రాయనిభాస్కరన్న వే
కరములు యాచకాంబుజవికాసకరంబులు శ్రీకరంబులున్.

ఉ. ఆసలవ్రాలువ్రాయ సచివాగ్రణి బాచనకే ఘటిల్లుఁబ
ల్గాకిమంత్రినందనులు గంటనుముట్టి లిఖించినట్టి వ్రా
లాకులు రాటపాకులు చెవాకులు బ్రాహ్మణవీథిలోనిపు
ల్లాకులు లంజెలింట్ల పలుగాకులు గాక నిజాన కాకులే!

ఉ. వ్రాయుఁ బసిండిగంటమున రాజహితైకరహస్యకార్యముల్
వ్రాయు ధనార్థికోటినిటలంబున శోభనభాగ్యసంపదల్
వ్రాయుఁ జకోరలోచనల వక్షమువచన్నుల మన్మథాంకముల్
రాయనిమంత్రి భాస్కరుఁడు వ్రాసినవ్రాఁత లసంఖ్యముల్గదా.

## కోట సింగమంత్రి.

ఉ. భానుజుఁడర్థముం గుముదబాంధవుఁ డాయమృతంబు మేఘుఁడున్
దానజలంబు నన్న మదిధర్మజుఁడున్ గలవేళ నిత్తురా
వానిని వానివాని మఱివానినిఁ జెప్పకు కోటసింగఁడే
మానక కాంచనామృతసమానజలాన్నము లిచ్చు నెప్పుడున్.

## గుంటుపల్లి — ముత్తయమంత్రి.

చ. ఎలమినిమించి బంధుజనులెల్లను హత్తెఁ బ్రమత్తులై సరా
జులు సభలన్ మహామహిమ సూచుచు మ్రొక్కుచుఁ జేతులెత్త మా
ర్మలయు ప్రమత్తకృత్తరిపుమంత్రులు పాదము లొత్త కీర్తి నై
వెలసితివౌర గుంటుపలివీరమముత్త వదాన్యశేఖరా!

శా. ముత్తామాత్య పదాబ్జ! నందనగరీమూర్ధన్య! మత్తారిరా
హుల్త్రోన్మత్త నజీరవారపరివారోదారసాహోనమ
ద్దత్తోపాయనదానలోల యిదిగో దండంబు లర్పించెదన్
జిత్తాంభోరుహపీఠశోభితమహాచేతోభవారాతికిన్.

మ. శతమన్యుం డమరావతేలఁగ సురల్ సత్త్రాలపాలైరి సం
గతిఁ బాతాళము శేషుఁడేలఁగ ఫణుల్ గాలాపటించుండె నీ
క్షితి నీవేలఁగ వీరముత్త! మనుజుల్ శ్రీగంధముల్ బుష్పముల్
హితరాజాన్నము గల్గి యుండి సుఖులై రెల్లప్పు డుల్లాసులై

శా. నావిష్వక్సవిశావిశృంఖలనచో నైపుణ్య ధారాళ ధా
రానష్టంభవిజృంభణంబునకు నారా వీరముత్తప్రధా
నావిర్భూతవితీర్ణి కల్గనల లేదా యన్యుల న్వేఁడనా
ఛీ వాచాస్ఫుటి! ఛీ కవిత్వము!ఛిఛీఛీ!! యర్థకాంక్షారతుల్!

చ. కమలభవాండభాండమునఁగల్గిన! నందపరంపు టింట్లలోఁ
బ్రముఖుఁడు రాయనప్రభుని భాస్కరుఁడే నెఱదాత; సిమ్మటన్
విమలగుణౌఘుసంటునలివీరయముత్తఁడె దాత భట్టసం
భ్రమఘనదానసూధినొక పాటినదాన్యుల నెన్న నేటికిన్

క. నాలుగుదుర్గంబులు పసు
నాలుగుదేశములప్రజల నయమా మునన్
లాలించుచుఁ జిరకాలము
పాలించెను ముత్తమంత్రి ప్రభుమాత్రుండే

క. పొందుగ శరజలనిధిహరి
చందనతరుచంద్రసంఖ్యశకవర్షంబుల్
దుందుభి నాషాఢంబున
నందముగా వీరముత్తఁ డరిగెన్ దివికిన్

## సాళ్వతిమ్మరుసు.

క. ఏతెంతురు తమఁ దామే
దాతలసన్నిధికి నర్థితతు లుర్వీశుక
వ్రాతమునకుఁ జాతమహీ
జాత మ్మంపినది కమ్మ! సాళువతిమ్మా!

## కోనమరుసు.

క. చేపట్టిన ధ్రువులవుదురు
కోపించిన రంభఁగూడుకొందురు జగతిన్
స్థాపింపఁ బోడువ నేరని
యాపందలు సాళ్వకోనమరుసు న కెనయే

## మహిమలూరి పెమ్మయసింగన.

క. సంపదలు జలతరంగము
లింపలరఁగ వచ్చుఁ బోవు నిమ్మహిలో మేల్
సంపాదింపఁగవలెరా
పెంపలరఁగ మహిమలూరి పెమ్మయసింగా!

## సింగయరామన.

క. చేతికి గంటము వస్తే
క్రోఁతికి సిరి మెత్తినట్టు కొందఱుమంత్రుల్
నీతియెఱుంగక బిగుతురు
సీతారామాభిరామ సింగయరామా!

## భట్టిప్రోలు మల్లయమంత్రి.

ఉ. నీవలెనిచ్చుదాత ధరణీస్థలిలో మును కర్ణుఁ డొక్కఁడే
నీవలె మాటలాడుతరి నేర్పరియౌ నిల శేషుఁ డొక్కఁడే

నీవలెసుందరాంగకమనీయతరుఁడు జయంతుఁడొక్కఁడే
భావితబట్టిప్రోలు కులపావనమల్లయమంత్రి ధీమణీ.!

మాదిరాజు వేంకటమంత్రి,

క. అన్నా మంత్రిశిఖామణి
నిన్నెప్పుడుఁగోనసీమనియోగ్యులలో
నెన్నికదాతవటంచును
విన్నాఁగముమాదిరాజువేంకటమంత్రీ!

డొక్కాసీతమ్మగారు.

ఈమె నిరతాన్నప్రదాత్రిగాఁ గొలఁది కాలముక్రింద రాజోలు తాలూకాలో నున్నదట! ఈమెభర్తపేరు జోగయ.

సీ. శ్రీగల్గురాముఁ డీజోగాభిధేయుండు
ధరణీతనూజ సీతమ్మగారు
కాశివిశ్వేశుఁ డీఘనుఁడు జోగయగారు
తగునన్నపూర్ణ సీతమ్మగారు
సురకులాధీశుఁ డీజోగాభిధేయుండు
నభినవవాణి సీతమ్మగారు
దానచంద్రుఁడు జోగమానవశ్రేష్ఠుండు
నిమ్మరోహిణియు సీతమ్మగారు

గీ. అనుచు మిము యాచకులుకొనియాడుచుంద్రు
అహహ తమభాగ్య మేమని యభినుతింతు
అతులగుణధామ డొక్కాన్వయాబ్ధిసోమ!
అవుర! జోగయనామ! సీతాభిరామ!

లోభి.

క. యాచకుఁడు లోభివానికి
రాచూరిఫిరంగి దానరాధేయునకున్

సూచింప దేవరాయలు
నీచపుదగిడీల నెన్న నేటికిఁ బుడమిన్.

గీ. దాతగానివాని ఖ్యాతిగా నెన్నిన
దాతయౌనె వాఁడు ధరణిలోన
గడ్డిపరకపేఁకి గంగ నల్లార్చిన
దర్భయగునె యజ్ఞతంత్రమునకు.

ఉ. తిట్టిన రోసముంబడఁడు దీనసయిచ్చిన సంతసింపఁడా
కట్టిఁడిలోభి కెంతయధికారముగల్గిననేమి? లేకయే
బెట్టుగనున్న నేమి? నసపీనుగుకున్ మణిభూషణంబులన్
బెట్టిన మొట్టినన్ సరియె మెచ్చునొ నొచ్చునొ కాళికేశ్వరీ!

ఉ. ఎవ్వరిసొమ్ము నెంతదిన నెవ్వరి కున్నదొ ప్రాప్తికల్గినన్
దవ్వులనున్నఁ బిల్చి తమఁదార యొసంగుదు రంతయంత పై
నవ్వల నెంతవేఁడినను నాప్రభు వెంతయొసంగఁజూచినన్
గవ్వయు నివ్వనీదు తనకర్మము పెమ్మయసింగధీమణీ!

క. అంటేవేళకు నంటును
నంటనితటి నంట దెంతయలమటపడినన్
అంటే భాగ్యంబుంటే
నింటికిఁ దా నడచివచ్చు నిమ్మహిలోనన్.

ఉ. క్రూరగణంబు మందు విషగుంభితవాక్యము గుండు పద్యమా
ఘోరపుబల్ ఫిరంగి కవికోపము వహ్నియు నంటి సూటిగాఁ
గూరిక బారుసాగి కొనగుండు దడాదడి దూఁకి తాఁకినన్
సారెకు లోభి తూలఁబడు సాలమహీజము కూలునట్లుగన్.

ఉ. మొండిశిఖండిలోభులను ముఖ్యజనావళి వేఁడఁబోయి తే
దండమనేది, రెణ్ణాలలు తాళు మనేది, మఱింతనొక్కి తే

నుండు మనేది, యీదినసమోర్చుమనేని, సహించిచూచితే
మండిపడేది మొండిచెయి మాటుకొనేది వివాదపద్ధతిన్.

శా. ఇచ్చే దెన్నఁడులేద యిత్తు ననెనా యీప్రొద్దురా రేపురా
వచ్చేయేటికిరా యమాసపయిరా వడ్లమ్మఁగారా ధరల్
హెచ్చేటప్పుడురా మఱొక్కపుడురా యీమధ్యతంటాలచేఁ
జచ్చేనన్నను గన్వలేదుగదరా చాగంబు లోభిప్రభూ!

ఉ. ఇంతుల కిచ్చినట్లు సుకవీంద్రుల కియ్య రదేమిచోద్యమో
యింతులు చెంతఁజేరి యెలయింతురు పైకొనువేళ మోవి నా
కింతురు గాఢబంధరతికేళిసుఖంబున నోరితమ్మతి
న్నింతురుచెక్కునొక్కి మురిపింతురు మే నిఁక నేమిచోద్యమో!

గీ. విత్తమొకని కిచ్చి వితణభరణంపుఁ
జిత్త మొకని కిచ్చి చెఱిచినాఁడు
బ్రహ్మయాలిత్రాడు బండి తేవునఁద్రెంచ
రెండు నొకని కీక బందుచేసె.

తంగెడకొండఁడు.

ఉ. పింగళ యేకచక్రపురి పెంపుగ నందు వసించియున్నయా
తంగెడకొండఁడే బకుఁడు తథ్యము మానవులార! వాని బా
ధం గడముట్టఁ జేసె మును ధర్మజు తమ్ముఁడు భీముఁ డిప్పుడా
యెంగిలిముచ్చుఁ జంపుటకు నీశ్వరు వేఁడుఁడి భీముఁ డయ్యెడున్.

వనమయగారితుక్కన.

చ. మును పొకకేల రావణుఁడు మోదమునన్ రజతాద్రి యెత్తినం
తనె హరుఁ డోపఁడే తనపదంబునఁ ద్రొక్కి మదంబ డంపఁగా
వనమయగారితుక్కసచివా యలశ్రీగిరి గడ్డపాఱలన్
గనలుచుఁ ద్రవ్వి సర్వమును గైకొనునీ కిపు డాతఁ డోపఁడే!

## బాచమరుసు.

[పలుకలూరి గోపన చెప్పినది]

గీ. గోలకొండమలక గోవులభక్షించుఁ
గొండవీటి విప్రకులము నెల్ల
బాచమరుసు చేరి భక్షించుచున్నాఁడు
పలుక మేలో బాచమరుసు మేలొ.

## బెహారాదారన.

ఒకానొక బాటసారి 'బేచిరా' కయిన దని యెఱుఁగక క్రింది యగ్రహారము పేరువిని వెళ్లివెదకి కానక విసిగి చెప్పినపద్యమట!

ఉ. కాసరకూసరై మిగులగందరగోళపుమూలమై రసా
భాసపుహేతువై వికటపద్ధతిరై సిగపట్లగోత్రమై
దాసరిపాటరై బెహరదారన చేసిన యగ్రహార మా
కాశముముట్టి తోఁకతెగి గాడిదవాలకమయ్యెఁ జూడఁగాఁ

## పుప్పేవు-- వేంకట్రాయఁడు

క. పుప్పేపువంశభవ వెం
కట్రావా! దుస్స్వభావ! గార్ధ(!)గ్రీవా
నిట్రాచట్రావిభవా
భట్రాజులకియ్యలేవు బడవా! చెడవా!

## పేరులేనివాడు.

సీ. వేశ్య— నిద్దఱితోడ వీథిలో నిలుచుండి
జోడుగా ముచ్చటలాడ భయము
కొంప సౌరుగఁ గట్టుకొని కాపురంబుండి
తెల్లనిబట్టతోఁ దిరుగ భయము
గంధాక్షతలు పెట్టి కడుపార భుజియించి
నిండార వీథిలో నిలువ భయము

 

శుభశోభనములందు సొంపుగా స్త్రీలతో
రాగిల్లి యూరనూరేఁగ భయము
గీ. నెట్ట సంగీతొడిగి పాగచుట్ట భయము
బ్రాహ్మణులపాలిమృత్యువు పాపజాతి
కఠినచిత్తుఁడు వీఁడమ్మ కడుపుగాల
... ...

## మఱికొందఱు.

ఉ. బానెఁడుజొన్నంవంటకము పంటెఁడుపాలును మేటిచారు లెం
తేనియుఁ బుల్లఁగూర కడుఁదేరినమజ్జిగ పెద్దచెంబెడుక్
బూనిచి కమ్మచాదరులు బొట్టలు పెంచుక కొండవీటిలోఁ
గానరు కుంభకర్ణ గజకర్ణ హిడింబ బకాసురారులక్.

ఉ. తిండికిఁ గుంజరంబులు విపీర్ణికిఁ గంటకిభూరుహంబులుక్
దండ ... గృహంబులకు దండధరుల్ రణరంగభూమికిక్
ముండలు కుండగోఁకరులు ముచ్చటకుం గొఱగానివార లి
మ్మండలమందుఁ గొంప ఆధమాధమకమ్మబికారిత్రిమ్మరుల్.

క. పిండెంత రొట్టెయంతే
మండలపతిమను వదెంత మానుషమంతే
గుండెంత తూనికంతే
మిండనియా వెంత లంజె మేలము నంతే.

## చౌకదనము.

సీ. అత్తవారింటిలో నల్లుఁడు తఱచుగాఁ
జనవున మెలఁగుట చౌకదనము
పరమాప్తులయినను బాంధవులిండ్లకు
సారెకుఁ బోవుట చౌకదనము

ప్రజకు సమ్మతిలేని పాతుపత్తెము చేసి
చాలించుకొనియుంట చౌకదనము
తనభూమిఁ గోల్పోయి తానెంతరాజైన
పరివారిఁ జేరుట చౌకదనము
గీ. గాన యభిమానవంతుఁడు గౌరవమున
దూరమున నుండి మర్యాద తొలఁగకుండ
నంచితం బగుయశము దక్కించుకొనును
వేంకటాధ్యక్ష వికసితపంకజాక్ష!

తీర్పరి.

సీ. తగవునఁ గూర్చుండి ధర్మంబుదప్పెనా
తప్పు కాతనికళత్రముకుఁ దాఁకు
అర్థంబు నేపాటియాసించి చెప్పెనా
యుభయవంశంబులు నుడిగిపోను
పక్షపాతము చేసి పాప మార్జించెనా
తొలఁగక యతనిపుత్త్రులకుఁ దాఁకు
కపటిరై తగ వెఱుంగక తప్పఁజెప్పెనా
కాలునిపురికిఁ దాఁ గదియనేఁగు
గీ. వాదిప్రతివాదిమాటలవరుస నెఱిఁగి
యుభయసాక్షుల పల్కుల నుచిత మెఱిఁగి
సత్యమైనట్టిమాటలజాడ యెఱిఁగి
తగవుతీర్చినయతఁడెపో ధర్మరాజు.

క. ధర్మముచెడి రెండాడిన
దుర్మార్గుఁడుగృహముపట్టు తుడిచినభూమై
నిర్మూలోన్మూలంబై
ధర్మజు పురికేఁగి మలముద్రావుచునుండున్

చ. ప్రథమిని సత్యసంధుఁడగు పుణ్యునినోరు పవిత్ర మెప్పుడున్
వసియతనాన నూటి కొకమాటయినన్ నిజమాడనేర నా
గడుసరినోరు నోరె యతికష్టపుఁగంపిడిబేజలారనీ
వ్యాపలెడిక్రంత తుంపెరపురీహనుమంత నితాంతవైభవా.

## తూర్పునాడు.

సీ. శ్రీరామ? పతిపేళ్లు దొరలు రాచకొమాళ్లు
వెలమనాయళ్లు చేవళ్లు గోళ్లు
కాళ్లను బొంకోళ్లు కడునోరసీగముళ్లు
వింతకట్టురుమాళ్లు బంతికూళ్లు
చెవులపోఁగులజోళ్లు చేయీఁ బెపదిమూళ్లు
మాటన్యక్తపునోళ్లు వేఁటకాళ్లు
వెలిరారుమగనాళ్లు పెనుబాలకావళ్లు
గొల్లబోయళ్లు పైఁడెల్లజోళ్లు
గీ. చాలుఃహామిళ్లు తాళ్లు వజ్రాలరాళ్లు
నీళ్లు గలయూళ్లు నడవికసందేళ్లు లేళ్లు
మహాలుకట్టళ్లు పాఁతళ్లు మానుఁబోళ్లు
మెప్పు నడవళ్లు తూర్పున నుప్పుమళ్లు.

## కర్ణాట దేశము.

సీ. జిలుగువన్నెరుమాళ్లు చెవులముత్యపుజోళ్లు
వెగటైనవడదోళ్లు వేఁటకాళ్లు
వారకాంతలయిళ్లు వచ్చురాచకొమాళ్లు
నారీమణులపెళ్లు నారికేళ్లు
వాసించువటివేళ్లు వారిజాక్షినగళ్లు
దాసరిదేవళ్లు తలచుగుళ్లు

శృంగారసానళ్లు బంగారు మెఱనూళ్లు
నిగ్గైనమద్దెళ్లు నేర్పుకాళ్లు
గీ. ఎట్టివారికిఁ గలరయా యిద్దఱాళ్లు
సంతలంబును దమయొద్ద బంతికూళ్లు
మాటనిలుకళ్లు మఱిమంచినీటుకాళ్లు
పొందుకర్ణాటదేశపుఁ బొందుకాళ్లు.
సీ. కాసుపుట్టనియూళ్లు కఱవు మజ్జిగనీళ్లు
పడిపొళ్లచేనిళ్లు పాడుగుళ్లు
సరిజేసిసానళ్లు మొఱలుపెట్టువఱళ్లు
పరుగులెత్తెడిలేళ్లు పలుఁగుతాళ్లు
చాటవాఁగులనీళ్లు సరకు లేనంగళ్లు
పెనులోభులనగళ్లు పిచ్చపళ్లు
సాలపముండలజోళ్లు మడ్డిచెక్కలపోళ్లు
తెంచెప[?]శివపాళ్లు తెల్లనూళ్లు
గీ. చివికిపోయినపందిళ్లు చింపిదళ్లు
చీదరాచకోమాళ్లు తబ్బిబ్బువేళ్లు
తోడుఁబోతులవడుసుళ్లు తుమ్మబీళ్లు
పోరుమామిళ్లనడనళ్లు పూటకూళ్లు.

## కొండవీటిసీమ సముతులు.

సీ. కొండవీటిసీమకోర్కులు దీర్పంగ
దండిసముతులు పండ్రెండు రెండు
ఎలమితోఁ జెప్పెను, ఏదేదియంటివా
పాలడ్గు పులిపఱ్ఱు ప్రత్తిపాడు
సంతెనరావూరు సరసను నూతక్కి
[illegible]

మంగళగిరియును మఱి మంచిమనుఁగోడు
రంగైననాదెండ్ల రాయఁపూఁడి
గీ. దాచినధనంబువంటిది కూచిపూఁడి
పంట లధికంబు గుంటూరు ప్రజలకెల్ల
పాడిబానలు గలిగుండు తాడికొండ
పరమమల్లేశ శివలింగ! పార్వతీశ.

## మాచెర్లసీమ.

సీ. సిరిమించుమాచెర్ల సీమదేశంబునఁ
దుదముట్టఁజూచినఁ దువ్వభూమి
ఆభూమిపంటలు నారికె కందులు
చామలు నువువలు సజ్జలు మఱి
పసపుతోఁ గొఱ్ఱలు వరిగ లల్చందలు
నుములు పెసరును నాముదాలు
ప్రత్తియు రాగులు పాలెపుజొన్నలు
పదునాల్గు వన్నెలపంట గలదు
గీ. అందుఁగూరగాయ లనువైనగోఁగులు
పుచ్చకాయ తుమ్మిపులుసుఁగూర
పాలుపెరుగు నెయ్యి పరిపాటిగాఁ గద్దు
ఇంతకన్నలేద యెంచిచూడ.

## వీరనకనుపూరు,కొల్లుకుదురు.

ఈరెండుగ్రామములును నెల్లూరిదగ్గఱనున్నవి.

ఆ. వె. ఊరిచుట్టుముండ్లు నుదకంబు మధ్యంబు

తీరు దినుసు లేనివిరనకనుపూరు
పాడుకొంప దీసిఁ బ్రాడు ద్రెంప
ఆ. వె. ఒక్కపా లెగేసి యొక్కపాలు దిగేసి
ఉన్నయూరిమీఁద మన్నుబోసి
పాపరాజుపోయెఁ బారుపత్తియుఁబోయె
కొల్లుకుదురుమీఁదఁ గొఱవిపెట్టి.

## ఉదయగిరి రాజ్యలక్ష్మి.

క. ఉదయగిరి రాజ్యలక్ష్మికి
సదనము నెల్లూరు, అట్టిసాధ్వీమణికిన్
వదనంబు కందుకూరున్
బదయుగళం బాత్మకూరు బట్టేపాడున్.

## కొప్పోలువృత్తాంతము.

"శ్రీకృష్ణదేవరాయలచేఁ గొప్పోలుగ్రామమును బొడ్డుచెర్ల తిమ్మన యగ్రహారముగాఁబడసెను (ప్రథమభాగముచూఁచునది.) ఆతిమ్మనమంత్రికుమారుఁడు వెంగన్న యాకొప్పోలుగ్రామమునకుఁ బాపఘ్నినదినుండి కాలువత్రవ్వించి నాగులకుంట యనుపేర నొకచెరువునిర్మించి యానీటిచేతఁ దనయగ్రహారమును నదీమాతృకము చేసికొని యుపపన్నుఁడగుచుండెనట! దానికోర్వక తమకేదో నష్టము కలుగుచున్నదని లెంబాకనాగిరెడ్డియనునాతఁడు తద్గ్రామాధికారిగా నున్నపోచిరాజు ఓబన్నతోడ్పాటున వెంగన్నమీఁదఁ దగవు సాగించెనట! అప్పుడు దేశాధీశ్వరుఁడుగానున్న మట్ల-కుమారనంతరాజుగారికడ కేఁగి బొడ్డుచెర్ల వెంగన్న విన్నవించుకొన్న విధము:—

సీ. కొప్పోలుకవి దిశాకుంజరంబులమీఁదఁ
గోలాహలంబాడెఁ గోలకట్టె
తగఁగృష్ణరాయేంద్రదత్తాగ్రహారంబు
నాశంబుగాఁ జూచె నాగిరెడ్డి

యారాజ(?)నరనాథకృతి మైన పెనుగాల్వ
కూలఁద్రొబ్బఁగఁ బుట్టెఁ గుంటకట్ట
వెలయ వామనమహోత్పలశాసనంబులు(?)
తల్లడంబులు చేసె నల్లఁ డహహ
గీ. విని పరామరిసించు మావిన్నపంబు
చిత్తమున నుంచు పోషితాశ్రితకలాప
మట్లకులదీప! మత్తారివంశ హరద
నర్గళప్రతాప! కుమారనంతభూప!.

దీనిపై ననంతరాజుగారు వెంగన్న కనుకూలముగాఁదగవు తీర్చిరట!
పోచిరాజు - ఓబనమీఁద బొడ్డుచెర్లవెంగన్న చెసినపద్యములు.

సీ. మహిఁ దేలుమట్లకుమారనంతాన్వయ
మూర్ధాభిషిక్తునిముదల లేక
అ..................నాథ
మంత్రిశేఖరునిసమ్మతము లేక
కడుఁజిట్ట దీవించఁగాఁగలకొప్పోలు
పరకవిశ్రేష్ఠులయెఱుక లేక
అనయంబుగా పుండియన్నుపన్నులు పెట్టి
మను మేటికాపులమాట లేక
గీ. కాలనష్టంబుగాఁగుంటకట్టు మనుచు
నిచ్చె లేఁబాళనారికి నుచ్చుకమ్మ
... ... ...
గీ. గొడుగు కాలిపోయె గుఱ్ఱంబు చనిపోయె
వాలు తొలఁగిపోయె నల్లఁ డలిగె
నూరు మాటిపోయె నూరికి రాకురా!
ఓరి పోచిరాజు నోబ! దూబ!

## బాలకుల పద్యాలు.

సీ. జేజేలకనుబువ్వ! శివుని యాదలపువ్వ!
 జాబిల్లి రాఁగదే చంద్రమామ
నెండుచీఁకటిగొంగ! మెఱయుచుక్కల బాజుంగ!
 జాబిల్లి రాఁగదే చందమామ
చిగురుఁగైదువు కామఁ జెలఁగురావుతుమామ!
 జాబిల్లి రాఁగదే చందమామ
లచ్చికన్నియతోడ! యచ్చవెన్నెలవాఁడ!
 జాబిల్లి రాఁగదే చందమామ

గీ. చిన్నయన్నకు శ్రీరఘుశేఖరునకు
వెండిగిన్నియలోపల వెన్నపెట్టి
పమిడిగిన్నియలోపలఁ బాలుపోసి
చాలఁ దినిపించి పోఁగదే చందమామ.

గీ. వెండిగిన్నెలోన వెన్నయు నెయిపోసి
పమిడిగిన్నెలోన పాలుపోసి
చందమామ రావె! జాబిల్లి రావె! మా
చిన్నబిడ్డతో భుజింతుగాని.

## వినాయకుని చవుతి.

సీ. సిద్ధివిఘ్నేశ! ప్రసిద్ధిగాఁ బూజింతు
 నొనరంగ నిరువదియొక్కపత్రి.
దానిమ్మ మరువమ్ము దర్భ విష్ణుక్రాంత
 యుమ్మెత్త దూర్వాయు నుత్తరేను
కలగర మారేడు గన్నేరు జిల్లేడు
 దేవకాంచన రేఁగు దేవదారు.

జాజి బల్ రక్కసి జమ్మియు దాసాని
　　మాచిపత్త్రిరి యారె మంచిములక
గీ. భాద్రపదశుద్ధమునఁజౌతిఁ బగటివేళఁ
బప్పు పాయసమును నానుఁబ్రాలు తేనె
నేయి యుండ్రాళ్లు కుడుము లుపాయనముగఁ
గోరియర్పింతు నీకు నేఁ గోర్కెతీఱ.
క. మగ్గిళ్లు వచ్చినప్పుడె
గుగ్గిళ్లను పెసగపప్పు గుండ్రుండ్రమ్ముల్
నెగ్గైన నేతిలెప్పలు
నగ్గముగా నీకుఁదెత్తు నయ్య గణేశా.
గీ. పెద్దయేనుఁగుపై నెక్కి బిరుదుపడగ
లడర ముత్యాలజగజంపుగొడుగునీడఁ
జిన్నినగవుల రఘువీరశేఖరుండు
ప్రేమ నేతేరఁ గోరుచున్నాము మేము.

బోగిపండుగ.

సీ. బోగిపండుగవచ్చెఁ బొందుగా మనయిండ్ల
　　తలయంట్లు సాగింపవలయు నేఁడు
ఎల్లి సంక్రాంతియు నెల్లుండి కను మావ
　　లెల్లుండి ముక్కను మేఁగుదెంచు
దండిగానిన్నాళ్లు పిండివంటలతోడ
　　నిష్టమృష్టాన్నంబు లింపుమీఱ
బావలు మఱఁదులు బంధుగు ల్లుండ్రు
　　వదినెలు మఱఁదండ్రు బంతిగుడిచి
గీ. క్రొత్తపుట్టముల్ ధరియించుకొని ముదమునఁ
గూడి కిలకిలలాడుచు వేడుకలర

పాడుదము పాట లాటలనాడుకొంద
మోలి మన మెల్లరము గూడి బాలురార.

## కన్యాదానము.

క. శ్రీయును గులమును రూపును
బ్రాయము శుభలక్షణంబు బాంధవవిద్యా
శ్రేయములుం గలుగువరుఁ గ
న్యాయుతుఁగాఁ జేయవలయు నధికప్రీతిన్.

సీ. పెండ్లికూఁతురి కేము పెట్టెటిసొమ్ములు
సరిగెపచ్చలు బన్నసరము తీగ
పేరలు, పిల్లాండ్లు బెబ్బులికాయలు
వీరమద్దెలు పణిహారములును
గంటలమొలనూలు దంటయొడ్డాణంబు
రంగొప్రధానంపు టుంగరంబు
సిరిగజ్జె లందెలు చేర్చుకట్టు బంగారు
నేవళంబగు కొల్కి బాలివీలు

గీ. అన్నియును దెచ్చి యిచ్చెద మాదరించి
ఘనుఁడ వోమామ! గంధానఁ గాళ్లుకడిగి
పిన్నవరుఁడను నాకు మీకన్నె నిమ్మ
శ్రీకరంబుగ నాశీర్వచింపు మమ్మ.

క. పున్నమచందురు నేలెడి
చిన్నది మీయింటఁగలదు; సిరితోఁ జెలువై
యున్నాఁడఁ బిన్నవరుఁడను
గన్నియ నా కిచ్చి శుభముగైకొను మామా!

సీ. అరణంబు తగుమాత్ర మడిగితి నోమామ!
బాళువా పోకట్ల పరిషిణీలు

పచ్చలకడియాలు పదివ్రేళ్ల బటువులు
పటువుమాణిక్యాల పతక మొకటి
బిరుదుచెక్కడపుది బిళ్లలమొలత్రాడు
జమిలిపి యుత్తరజందెములును
తెగటుఁగోఁకులు మంచివగు రెండు సేలులు
దస్తుతురాయి జల్తారుపాగ
బంగారుసాలకి బాలీసు గొడుగులు
జాలుమతీ తేజీలు సూర్యపుటను
గీ. కడువిలువగల్గు బంగారుకలముదారు
పనితరముమీఱు దంతంపుఁ బావుకోళ్లు
నూమ యివియిచ్చి ముద్దుకుమార్తె నిమ్మ
శ్రీకరంబుగ నాశీర్వచింపు మమ్మ

## శ్రీకారములు.

గీ. ఒకటిసుతునకుఁ జెలికాని కొసరరెండు
మూఁడు సమునకు వైరికి మూఁడునొకటి
యేను భూపాలునకును శ్రీ లెలమి నిడుడి
పరసు లుత్తరములు వ్రాయుసమయములను.

## భోజనము.

[ఈక్రింది పద్యములందుఁ గొన్ని శ్రీనాథునివి.]

ఉ. మూతినిముట్టఁగావెఱతుముద్దకు ముద్దకుఁ గూటిలోపలన్
బాతికపాలుసైకతము పచ్చడి కొంచెమయాది యంత్యమున్
జాతమటన్న లేదు మఱి సున్నముకన్నను మెత్తనన్న మీ
రాతిరిఁబోలె భోజన మరాతికినైనను బెద్దు దైవమా!
గీ. పూర్వమందు విషము పుచ్చుకొన్నానని
గర్వపడెద వేల కాలకంఠ!

కొండపేటిసీమ పండు జొన్నలకూడు
తిన్ననీదుబయిసి తేటపడుసు.

క. పాలుబ్బజొన్నయన్నము
తాలించినవంగవరుగు తైలపు ధారల్
తేలఁ బరామర్శంబున
బాలురతోఁగుడువఁబెట్టుభార్తలపెద్దా!

క. నడినూఁకలేనియన్నము
నడఁబోసిననెయ్యి బుడమపరుగుల్ బెరుగుల్
గడి మాడసేయఁ బెట్టిన
నడగూడెపునంబిపడుచు నడిగితి ననుమీ!

సీ. కఠినంపుజొన్నల కటుకుకుడుమ్ములఁసూచి
వక్త్రిమా! భయపడవద్దుసుమ్మి
నానారుచుల్ గోరు నాలుకా నీవేమి
సందేహపడవద్దు చప్పరించు
ఎన్నఁడుఁగడిచేయ నెఱుఁగ నెట్లో యని
కుడిహస్తమా! నీవు జడియఁబోకు
కమ్మనివాసనల్ గ్రక్కున త్రేన్చెడి
గర్భమా! కుటకుటకాకయుండు.

గీ. [గీతికొంతచేకూఱకున్నది.]
వచ్చుబహుధాన్య నామసంవత్సరంబు
కాయగూరలు మనకునిక్కముగఁ గల్గు.

## సాపాటుబాపలు.

సీ. అపూపసూప సప్తాంగభంజనులార
ఆజ్యసాగరబడబాగ్నులార
శ్రాద్ధాన్నభుక్తివిచారతత్పరులార
పచ్చళ్ళరుచులకు మెచ్చులార

పొరుగూరికి తిండికిఁ బోదుపుఁ జుక్కల్లార
వేలొక్కచో వాయువేగులార
పానకవాహినీమానభంజనులార
బొబ్బట్లదొంతుల కుబ్బులార
గీ. తక్రసాగర వాతాపిదమనులార
జజ్జుపాటిన వ్రేలుడుబొజ్జలార
దినదినము తద్దినముకోరుధీరులార
పాలుతేరయ్య! సాపాటుబాపలార.

## నీరుమజ్జిగ.

క. గొప్పైన నిమ్మపండ్లును
గప్పురమును సొంటిపొడియు గటివేఁపాకుల్
ఉప్పును నేలకు లింగువు
నొప్పుగ నీచల్లరుచికి నొనగూర్పఁ దగుల్.

## చలి.

సీ. అగరుకురంగ నాభాత్యుష్ణతరసుగం
ధాంగరాగము లెన్నియలఁదుకొనిన
నికటస్ఫుటాంగార శకటప్రకటకేళి
గర్భగేహము లెన్నికలిగియున్న
కార్పాసతూలికా ఘటితకూర్పాసక
స్తోమంబులవి యెన్నితొడిగికొనిన
అతులితోదయ రాగహారిద్రమాంజిష్ఠ
కలితాంశుకము లెన్నికప్పుకొనిన
గీ. మానునేచలి నవవయోమ త్తమత్త
కాశినీనవ్యకస్తూరి కాను లేప
ఘుమఘుమామోద గురుకుచకుంభగాఢ
తరపరీరంభ సంభారసరణిఁగాక.

## వేసంగి.

ఉ. ఎండఁగొలంపలెల్లను మహీధరపఙ్క్తులు వహ్నికీలచే
మండెఁ ధరాతలం బినుపమంగలముంబలెఁ గాలియుండె నా
యెండల నేమిచెప్పఁ బరమేశ్వర యావరణాంబురాశి శే
కుండిన నాఁడె పాక్కి పడకుండునె పద్మభవాండభాండముల్

ఉ. ఆతపవహ్నిచేఁబథికు లార్చుచు దారిని గ్రుక్కి దాహసం
జాతతనెండమావులకుఁ జయ్యననేఁగుచుఁ దప్తపాదసం
భూతములైన గుల్లలను బొక్కుచుదిక్కులు సూచుచుక్ వెసక్
ఘాతను దూఱుచుక్ మఱియుఁదల్లడమందుచు నుందురెయ్యెడక్.

## అనావృష్టి దోషము.

సీ. తలనున్నజల మింత తొలఁకిపోయిన యంతఁ
జిన్ని పైదలి మై క్స్పశించు ననియొ
జడనున్న మొగులింత జారి పోయినయంత
సిగచక్కఁదనము కొంచెమగు ననియొ
పాదనున్నరసమింత పొంగిపోయినయంత
క్రొత్తమామబలంబు క్రుంగుననియొ
గిరనున్నమంచింత కరగిపోయినయంత
పట్టంపుఁజెలితండ్రి బడలుననియొ

గీ. ధర ననావృష్టిబాధ పాల్పఱిచెదేని
నీరథపు సొంపు ఇమ్మగు, డీమఱంది
వజ్రిచేఁబడు, నీవిల్లువహ్ని గలయు
నీపశుపతిత్వమును జెడు నీలకంఠ.

## నల్లి.

క. శివుఁడద్రిని శయనించుట
రవిచంద్రులు మింటనుంట రాజీవాక్షుం

డవిరళముగ శేషునిపైఁ
బనళించుట నల్లిబాధ పడలేక సుమీ,

చాఁకలి.

గీ. చాఁకివానితోడ జగడాలుపడలేక
సిరిగలాఁడు పట్టుచీరగట్టె
శివుఁడు తోలుగప్పె, నీ యని మదిరోసి
ఖైతవుండు చీర పాఱనై చె.

తీఁట.

క. తీఁటగలభాగ్యశాలికి
నీటుగలుగుగోళ్లు వేఁడినీళ్లు లభింపన్
దాటించి బఱుకసాగినఁ
దీఁటరొ దేవేంద్రపదవి తిరముగ జగతిన్.

పొగాకు - పొడుము.

చ. సురవనితాసమానలగుసుందరులన్ దనియించువేళఁ జా
తురి రసికత్వమున్ ధృతి మృదూక్తులు మోహము తేటొసంగ నీ
సరి యగువస్తు వున్నదె రసజ్ఞుల కీభువనత్రయంబునన్
సురపతి నీలరత్నరుచిశోభితగాత్రమ! ధూమపత్రమా!

ఉ. పూని దినంబుకన్నఁ బొలుపొందఁగఁ జేసితి వెట్టివాని కే
దానము లాచరించినజనంబుల కీఘనలోక మబ్బున
య్యా! నళినాక్ష! నీవెఱుఁగవా చతురానన! భూమియందుఁ బెం
పైనపొగాకుఁ జుట్టలను బాత్రుల కిచ్చినయట్టివారికిన్.

ఉ. ప్రొద్దున లేచి ధూమ్రధవళపుంజము కన్నుల నొత్తి యెత్తి కన్
ముద్దుగఁ జుట్టచుట్టి తనమోవిపయిం గదియించి మీసముల్
దిద్ది పొగాకు వేఁడినసుధీజనకోటికిఁ బంచిపెట్టినన్
బెద్దలపేరు చెప్పి పొగపీల్చిన వారు సుపూజ్యు లిమ్మహిన్.

సీ. పూర్వకాలమునాఁడు పొగఁద్రాగకుండిన
ధృతరాష్ట్రుకన్నులదృష్టి తప్పె
పాండురాజును జుట్ట పాటించకుండిన
భోగంబు చెడి పాండురోగి యయ్యె
శ్రీకృష్ణుడును-జుట్ట చేపట్టకుండి తా
నోగి జరాసంధున కోడిపోయె
దశరథుం డీచుట్ట తగనిషేధం బని
బుత్త్రశోకంబునఁ బొరలి చనియె
గీ. గాన యిది హవ్యకవ్యాదికార్యములకు
ముఖ్యమగు దేవతలకెల్ల మోదమిడును
సురుచిరంబుగ వట్రువచుట్ట చుట్టఁ
జేతఁబట్ట నాపుణ్యంబు చెప్పఁదరమె.
క. చేతులకాసులు పోయెను
నేతిరున నగ్గిఁ బెత్తు నెవరి నడుగుదుర్
రోఁతలఁ బెట్టకమునుపే
పోతివిగా నోరసెట్టి పొగయెలచిట్టే.
మ. మగవాఁడై జనియించినప్పుడె మదోన్మత్తక్రియాధీరుఁడై
పొగయాకుం బొగచిట్టి కాలు నెపుడున్ బొంకంబునాక్రోవిచే
సొగసు ల్మీఱఁగ వీధివీధిని జనుల్చూడంగ నేప్రొద్దుఁ దాఁ
బొగఁద్రాగన్ వలె లేనివానిబ్రతు కీభూమిన్ వృథా చెప్పితిన్.
క. పొగ ద్రాగి సోలి కామిని
జగడంబున మోహనాంగి సరసన్ నుయ్యెమైఁ
దగద్రావలి తేనె గ్రోలని
మగవాని దజేటిబ్రతుకు మహి నూహింపన్.

9

సీ. ధరణిజనులకెల్ల:-గురిగింజమాధవుం
డిది సత్యమని కరం బెనయఁ జూపె
ఈసత్యదళవృక్ష మిట గలఁడంచును
శేషాచలేశుండు క్షితిని జూపె
ఈసత్యదళవృక్ష మింతరెమ్మెత్తంచును
ఘనజగన్నాథుండు కటిని జూపె
ఈసత్యదళ పది యింతవెడల్పంచు
వినతబిడ్డఁడు కరం బెనయఁ జూపె

గీ. దేవతావళి వర్ణించి తెలుపునట్టి
యిట్టిమహిమంబు గలదీని నెవ్వరేని
యెలుక లేక నిందించెద రేమొ యనుచుఁ
జెలఁగి వీరాంజనేయుండు చేయిరెత్తె.

## రంగులపద్యాలు.

సీ. పార్వతీపతి తెల్ల పాలసంద్రము తెల్ల
కామధేనువు తెల్ల కంచు తెల్ల
నారదముని తెల్ల శారదాభ్రము తెల్ల
శారదాంబిక తెల్ల సంకు తెల్ల
ఐరావతంబు తెల్లమృతపూరము తెల్ల
పాదిశేషుఁడు తెల్ల హంస తెల్ల
కల్పవృక్షము తెల్ల కైలాసగిరి తెల్ల
మల్లెపూవులు తెల్ల మంచు తెల్ల

గీ తెలుపుచెప్పనేల వెలఁదికి మేలైన
ఘణముగల్గెనేని కోటిసేయు.

సీ. ఇంద్రనీలము నలు పింద్రానుజుఁడు నల్పు
యమునానదియు నల్పుయముఁడునల్పు
సామజంబులు నల్పు రామచంద్రుఁడు నల్పు
రతివల్లభుఁడు నల్పు రాత్రి నల్పు
ఆకాశ మదినల్పు హరునికంఠము నల్పు
తుమ్మెదల్ నల్పు కస్తూరి నల్పు
నీరజాక్షులకొప్పు నెఱివెండ్రుకలు నల్పు
బలరామదేవునివలువ నల్పు
గీ. నలుపు చెప్ప నేల నాతికి మేలైన
గుణము గల్గె నేని కోటిసేయు.
సీ. అరుణోదయం బెఱు పరుణాచలం బెఱు
పర్కమండల మెఱు పగ్ని యెఱుపు
బ్రహ్మదేవుం డెఱ్పు బంధూకసుమ మెఱ్పు
పద్మరాగం బెఱ్పు పద్మ మెఱుపు
మంకెనపూ వెఱ్పు మఱిదొండపం డెఱ్పు
నింద్రగోపం బెఱు పింద్రుఁ డెఱుపు
పవడంపుఁదీ గెఱ్పు జవరాలిమో వెఱ్పు
కుందనం బదియెఱ్పు కుంకు మెఱ్పు
గీ. ఎఱుపుచెప్పనేల యింతికి మేలైన
గుణము గల్గెనేని కోటిసేయు.
సీ. శ్రీధరుణీవిభుపీతాంబరము పచ్చ
కమలమిత్త్రునితురంగంబు పచ్చ
దేవతాచార్యునిదేహకాంతులు పచ్చ
పరిపక్వజంబీరఫలము పచ్చ
పదియాఱువన్నెలబంగార మది పచ్చ

తంగేడుపువుపచ్చ తమ్మియకరు పచ్చ
చాలఁ బూసినయట్టిరేల పచ్చ
గీ. పచ్చచెప్పనేల పడఁతికి మేలైన
గుణము గల్గెనేని కోటిసేయు.

[పైపద్యములందు గీతి కర్థమేమో, కడపటిరెండు పాదములెట్టివో, తెలియలేదు. వీనిఁగూర్చి యాభాణకమేదో కలదట]

## గాలివాన.

సీ. శ్రీరామ నీపాదసేవామృతంబుగా
సీసమాలిక యొండు చెప్పినాఁడ
జగతిలో నుత్పాతజంఝూసమీరంబు
విసరినవిధ మెల్ల విన్నవింతు
రుద్రసంబంధియౌ రౌద్రిసంవత్సర
కార్తికశుద్ధపేకాదశితిథి
ఏపార స్వాతిమూఁడో పాదమందున
వాయవ్యమున గాలివాన విసరె
చిటపొటచినుకులు చెలఁగి యదన మాఱె
ఘనమేఘములు మింటఁగప్పి నిలిచె
ప్రళయసముద్భూతభయదజంఝూనిల
మవని గంపింపంగ నడరసాఁగె
మేడలు గోపురాల్ మిద్దెలు కోటలు
నేలపైఁ గూలెను నీళ్లఁ గలసె
పశువులు మృగములు పక్షిజాలంబులు
నెల్లభూములయందుఁ గొల్ల లయ్యె
అష్టదిగ్గజములు నట్టిట్టు తిరిగెను
గరుడశేషునకు [illegible]

రవిసోమమండలరథములు గతిదప్పె
 నక్షత్రములు పూర్వపక్షమయ్యె
ఆవులు దూడలు నంభారవములతోఁ
 జెట్లను గట్లను జేరఁబడియె
అన్నలు తమ్ములు నతినలు పురుషులు
 కొడుకులు కోడండ్రు గురుజనంబు
తల్లులు బిడ్డలు తగఁ గాగిలించుక
 చలిచేత నలసట చాలఁ బడిరి
బంపరు బాపట్ల పరగ నిజాంపట్న
 గ్రామముల్ జలధిలోఁ గలసిపోయె
సాలేరు మూచేరు ప్రబలించి కొన్నూళ్లు
 వరదను గడునడి వార్ధిఁ జేరె
అద్దంకివినుకొండ యాప్రాంతములయూళ్లు
 గుండ్లకమ్మను బడి కూలిపోయె
కంనమూ లాదోని గండిగోటయు గుత్తి
 కడప సిద్ధోటముల్ కలవరించె
నల్లమలంతయు హల్ల కల్లోలమై
 కూఁకటివ్రేళ్లతోఁ గూలె ధరను
వెలిగొండవృక్షాలు వెల్లిపా లయ్యెను
 పాడిలెకొండను గుండ్లు పొర్లిపడియె
చిమకుర్తికొండయు ఛిన్నభిన్నంబయ్యెఁ
 గొండవీ డెంతయూ బెండుపడియె
సిరిగిరిమల్లయ్య చెక్కిటఁ జెయిచేర్చె
 భ్రమరాంబ చింతచేఁ బవ్వళించె
వేంకటాచలపతి విపరీత మనిపల్కె
 నలమేలుమంగమ్మ యడలసాగె

ప్రథకమున్న దేవళ్లు పరితాపపడఁ జూచి
యూళ్లదేవ ళ్లెల్ల నెళ్లఁ బడిరి
ఎసగాని విషవాయు వీశాన్యమునఁ బుట్టెఁ
బైరులు పంటలు పాడుపడియె
పాఁతళ్లధాన్యముల్ నూతులవిధమాయెఁ
గలవర్తకులకోర్కి ఘనతగాంచె
కఱవుదీఱినవెన్కఁ గడువేడ్క భూమికి
నెలమూఁడు వానలు నిండికురిసె
పెండుగా దండిగాఁ బండెను బంటలు
నరహాకుఁ బుట్టెఁడు వసుధ నమ్మ
అంతట భూజను లానందమందిరి
సర్వత్ర సౌఖ్యముల్ సంఘటిల్లె
గీ. అహహ నీమాయ యేమనియభినుతింతు
బొసఁగ నీపాదమునఁ బుట్టి పుడమి ముంచె
మేలుగా నాల మంచెఁ బాతాళగంగ
నెమలిగుండము శ్రీరంగ.నిర్మలాంగ!

ఖేచరములు.

సీ. కలహంస కోయిల కనకాక్షి కాకియు
కొఁజు కొక్కెర కొంగ కారుకోడి
కాకి బెళ్వాయు మఱి కనుపెంటి కంకణం
కణిశిరి నల్లేరు కత్తిపిట్ట
కణుదురు కలకలం కావేరుగాడును
కనకపక్షికరంజికలుకజీఱ
గరుడఁడుగిజిగాడుఁ గరుడజీనుగగువ్వ
గుడ్లల్లుగాడునుగోయవంక
గడ్డిగాడును గద్ద గండభేరుండంబు
గొ...

గడ్డంగి గొగ్గడి గగ్గు గజ్జలపిట్ట
గొల్లకోవెలగుప్వగ్రుబ్బపిట్ట
గరిడి గుబిలిగాడు గజ్జిబోడయు ఖండ
చక్రవాకిచిలుక చాకిమోద
చిటిబెళ్వచెందొవ చింతచకోరంబు
చిత్తువచికబిందు చిందపగ్గు
పసచిరాయువు జపుడుకాకియుచిల్వ
చింత నిప్పరికాడు చెఱుసపిట్ట
లట్టెచంద చిటీల లకుముకిచి......
చడలుకోడియుచార్ల చంగగాడి
చీంకును చిటిగద్ద చిత్రాంగిమఱియును
చల్లపిడతనూర్ల సాలెగాడు
జగుజటాయువు జగ్గుజపపిట్ట లావుక
జెలగెటి జలకట్టె జిబ్బటాయి
జాలెడేగను పెట్ట జావడంబుసుపక్కి
జక్కయుజూటుపిట్ట జిట్టగడ్డ
డబ్బుడాసరిగాడు డాగుడాగులపిట్ట
తంగెడుబండారు తళుకులిరువు
తెల్లయేకులనారి తెల్లచిలుక తురంగి
తురతపిక్కిలితూరి తూనెగాడు
డోగడి డోరువ డొంతరంబుతురాయి
... ... ...
సిరుకోడియునేల సెమలియు నమలియు
మచ్చికాడు మరాళిమబ్బుజీడ
మడిరొల్చె మడియాళి మబ్బుకాడి ముసుంగు
నెరకాలిపిట్టయు నెన్నడాయి

రొయుగుబొంత యిల్లాయి యిలకత్తి యిట్టిరెు
ఆసకప్పరకాడు ఆకుముక్క
ఆడేలుతావలి హస్తిపిట్టయుమేటి
రమ్యమై విలసిల్లు లగుడులిక్క
వానకోవెలయును వారణముల్లంగి
పూసుగిత్తరిగాడు వోయగోరిక
వనభోజనమువగ్గు వగ్గోలు వదనిక
వసపిట్ట వసపుల్క వన్నెలాడ
వంగపండును నక్క వనజీపిపయువారి
సంకు బెన్నంగియు స్వాలికొంగ
సమ్మాళి రణగద్ద సరసరామయుచెల్వ
పరగిగోడియు మతిబహుళలీల
గీ. సకలగిరిదుర్గములయందుఁ బ్రకటముగను
పక్షిజాతంబు లీరీతి బహువిధముల
నుండు నేవేళఁ దందోపతండములుగ

## భూచరములు.

సీ. శరభంబు నేనుఁగు శాఖామృగంబును
మనుబోతు ధుప్పియు మానుబిల్లి
కారోప్పతు నెనుమును కణితిమృగంబును
సరసచతుర్దంతి చమరిమృగము
ఖడ్గమృగంబును కస్తూరిమృగమును
గురుపోతు గొటియయుఁ గొండగొటియ
జల్లిపోతుముసలి జవ్వాజిపిల్లియు
పునుగుఁబిల్లి యెలుక పొసఁగలేడి
జింక కొర్ణయు జేచు చిరతలపందియు
గండకంబును నిక్రిక త్రిగొడ్డక

గుణ్ణము తోడేలు కుందేలు గురుబోతు
కొంక నక్కయు మెడగోవు వుడుము
బెబ్బులి యుడుతయు బెట్టుత్త నక్కయు
కంచిమేక గొఱియ కాలు బెనుము
జీనుపంది బెసిడి సివ్వంగి కోతియు
నలరభద్రమృగింబునాకునంబు
బెగిలిపోతమ్మిడి వేసడంబు మఱియు
పంది పరంగియు పందికొక్కు
జగ్గుబిల్లిముసువు చన్నంగినక్కయు
రుద్రాక్షమృగమును లొట్టి పిట్ట
ముచ్చంగితాబేలు ముంగి కుక్క సరడు
గరిమెడికొక్కును గార్దభంబు
తొండయునలికిరి చుండెల్కదువ్వెన
మండయుగరిడియు మఱియుబల్లి
గీ. ఆదిగాగల భూచరాలతి శయిల్లు

జలచరములు.

సీ. తిమియు వాలుగలంబ తిరికియు నెత్తాము
పాసఁగఁజారగుడెయు బొమ్మడాయి
మారుపచందాము మలుగుమీను చాఱ
ముచ్చంగి కాంభోజ మొల్లమీను
కనుగు చిత్రపుమీను కొఱు మీనును గచ్చ
తేలుమీనును మొయ్య తేకుగండె
మాదకండె గొరక మట్టగుడిసె బెక్క
పారాయి పాపర పండుమీను
వాలెగ బొజ్జయు వల్లెక తట్టయు
పుల్లాము వేడిపవులసనేను

కోలువాసముగొయ్య కొఱ్ఱమీనును దొమ్మ
నారజల్లయు మోరనట్టు వక్క-
నులుమెయ్మ డాయియు ముసుకును దూవెను
పందిబోరయు పళ్కు-పారమీను
పెద్దజల్లెయుఁబక్క- పెనుచేపనుంగళం
కన్నెమీన్కు-దురుసు కాకి గండె
కొనచారకోపెయు కూనరొయ్య మెడుపు
యెగుమీను మతి పచ్చ యెఱుపుచేప
రాతికోకయు చొఅరాణంగి మిణుగురు
యిల్లొయిపూమేను నిసుక దొందు
ముక్కు-చేపయుకోలు కకు-పల్కె- నెలుసు
ఆకుజల్లనరుజానణుజామీను
కుచ్చుపిత్తలికాసు కుంటముక్కు-ను తిక్క-
చేసలాదిగఁగల్గు జలచరములు.

శ్రీ చెన్నరాయాధిపా.

శా. ఏకాంతంబున నీవు నేను మదిలో నింపైనమార్గంబునన్
జోకన్ గూడినముద్దులెల్లఁ దలఁపన్ జోద్యంబు లైయుండురా
నీకు న్నన్నెడఁబాయ న్యాయమటరా! నీ కింత కంటేలరా
చేకోరా చల మేల? మారకపురీశ్రీచెన్నరాయాధిపా!

శా. పోరా దగ్గఱ రాకురా నగకురా పూబంతి నే నొల్లరా
కోరా దుండమేలరా విడువరా కొంగేలపట్టేవురా
యేరా న్యాయము కాదురా తొలఁగరా యిల్లాండ్ర నీరితిగాఁ
జేరన్ జెల్లదు నీకు మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. నీవు న్నేనును దూఁగుటుయ్యాలలపై నిద్రింపఁగా నెవ్వతో
నీనంచు న్నను లేపి ముద్దుఁగొనెరా నీపేరనే పిల్చెరా
ఆవేళప్పు డదేలనిచ్చెఁ జెప్పురా ఆయింతిపేరేమిరా
శ్రీవైకుంఠనివాస! మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. పలుకుంజిల్కలపట్టెమంచములపై బాగైనపూఁబాన్పుపై
జెలువొందన్ బనలించి నాతొడలపై శ్రీపాదము ల్చాఁపఁగాఁ
గలిగేనా యిఁక నొక్కనాఁటికయినన్ గంజాక్ష! సంభోగముల్
జలుగున్వే స్నెలబైట మారకశ్రీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఆనుకం బగ్గల మాయెరా నలమురా తాపంబు సెట్లోర్తురా
నిముసంబైనను నిన్నుఁ బాసి యిచటన్ నే నెట్లు వేగింతురా
మనుతన్ బిల్చినఁ బల్క వేమిటికిరా మన్నించరా కాఁగిటన్
నెమటల్ జాఱఁగఁ గృష్ణ మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఎంతైనన్ వలపింప నేఁచఁదగునా? యేరా నినున్ బాయరా
కొంతైనన్ దయయుంచి యేలఁగదరా కోపంబుఁ జాలింపరా
కంతుం డమ్ముల నేసెరా నిలునరా కాకేల చేసెవురా
చింతంబెట్టక రార మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఏనారీమణియింటనుండితివిరా యిందాఁక రావేమిరా
నా నేరం బొకటైనఁ గావు మనుచున్ నా కేల మ్రొక్కెవురా
కానీ యిందుల కేమి తాళుకొనరా గర్వింపఁగా నేలరా
శ్రీనారాయణ కృష్ణ మారకపురీ శ్రీచెన్నరాయాధిపా!

శా. ఏరా నామన వాలకింపఁగదరా యేమంటి రమ్మంటిరా
రారా కప్పురపిడె మందుకొనరా రంజిల్లఁగా జేయరా
కోరా బంగరుబంతు లందుకొనరా కోపంబుఁ జాలింపరా
శ్రీరామా యిఁక నన్ను నేలుకొనరా శ్రీచెన్నరాయాధిపా!

శా. ప్రాపుం డా పని నమ్మియుంటిఁగదరా పంతంబుఁ జాలింపరా
యేప్రొద్దుం దలపోఁత లాయెఁ గదరా యీమారుతాపాలచే
రాపుల్ ఱట్టుకు లోనునైతిఁ గదరా రాకున్న నెట్లోర్తురా
శ్రీపాదంబులసేవఁ జేతుఁగదరా శ్రీచెన్నరాయాధిపా!

శా. నీకన్నన్ మఱిజాణ లేదుగదరా నీయాన నన్ బ్రోవరా
యేకాంతంబున బుజ్జగింతుఁ గదరా యీవేళ నన్నేలరా
నాకు న్నీకును నొక్కయీడు గదరా నాముచ్చటల్ దీర్చరా
శ్రీకాంతాప్రియ నన్ను నేలుకొనరా శ్రీచెన్నరాయాధిపా!

శా. చెంతన్ జేర వదేమిరా తగదురా చేపట్టి నన్నేలరా
యెంతైనన్ నినుఁ బాయలేనుగదరా యిందేమిచోద్యంబురా
కంతుం డేయఁ దొడంగెరా కటకటా కాకేల చేసేవురా
చింతల్ మానిపి నన్ను నేలుకొనరా శ్రీచెన్నరాయాధిపా!

## భ్రమరాంబామల్లీశ్వరసంవాదము.

శివాలయములలో నీపద్యముల నుత్సవవిగ్రహములకుఁ బవ్వళింపు సేవవేళ ద్వారములలోన నొకరు వెలినొకరు నుండి చెఱుసగముగా నీపద్యములఁ బాడుదురు.

శా. శ్రీమద్భూమిధరాధిరాజతనయా శృంగారగాత్రోజ్జ్వలా
నామీఁదన్ దయలేక నీవును వృథా నన్నేల వీక్షింపవే:—
ప్రేమన్ వేఁటనెపంబునం జని పరస్త్రీఁ గూడినా విప్పుడున్
శ్రీమించన్ ననుఁ గూడనేల పదరా శ్రీశైలమల్లీశ్వరా!

శా. భామారత్నమ! యెవ్వతో మఱుఁగుగాఁ బాటించి చెప్పంగఁబో
నేనైన్ గుఱు తిందుకుం గలదటే యీసందియంబేలనే!—
యామోదంబున నీవు వచ్చినవిధం బాతీరు గన్పించెరా
[illegible] శ్రీశైలమల్లీశ్వరా

మ. మృగసందోహమువెంబడిన్ బొడల దూరేపోవఁగాఁ గొమ్మలన్
దగులంగాఁ గురు లన్నియుం జెదరెనే తథ్యంబుగాఁ జూడవే:—
నిగులం బొంకితి విందుకుం జతురతన్ నీవెవావిపై నేటికిన్
జిగిమించం బలు బలుగెంపు లెక్కడివిరా శ్రీశైలమల్లీశ్వరా.

మ. చిలుకం దెచ్చిన ముద్దు సేయుతఱిఁ జూచెం బింబభావంబునన్
జెలియా గ్రక్కున నాదు మోవిఁ గఱచెన్ సిద్ధంబుగాఁ జూడవే:--
బళిరా! నేర్పునబొంకిచెప్పితివిగా బాగాయె నీకోకలన్
జిలిమించన్ బస పేటి కంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా!

మ. వరపద్మాకరమధ్యమస్థలములన్ వర్తింపఁ బద్మంబులం
దొరయన్ గోఁకలనంటెఁ బుప్పొడు లివే యొచ్చెంబు చేసేవటే:-
సరసత్వంబున బొంకి చెపితివి నీస్వాభావమే చెక్కులన్
స్థిరపీటీరస మేటి కంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా.

శా. సింగం బున్నగుహాంతముల్ వెదకుచోఁ జేసుర్లపై డిగ్గుచుం
డంగం జెక్కుల జేగురంటె నెఱయన్ నాకీశిరోరత్నమా!.—
అంగీకారముచేసికొంటి నని నీయంగంబుపైఁ గ్రొన్నెలల్
సింగారించినభామపేరు చెపురా శ్రీశైలమల్లీశ్వరా!

మ. తరుణీరత్నము! జేగ వీడ్వడి మహాదర్పంబునం బోవఁగాఁ
దిరుగం బట్టఁగ జేగగోరులు పయిన్ దీర్ఘంబుగా నాఁటెనే :—
సరవి న్నన్నిటి కన్ని బొంకితివిగా సర్వజ్ఞ నీకన్నులన్
సిరిమించ న్నెఱు పేటికంటెఁ జెపురా శ్రీశైలమల్లీశ్వరా!

శా. వేమాఱున్ నను నేరముల్ పలుకఁగా వ్రీడాంతరంగుండ నై
నీమీఁదన్ గతినొగ్గస్పృష్టి నిలుపన్ నేత్రంబు లిట్లాయె నే
నీమాటే యొకటైన సత్యమటరా నే విశ్వసించం జుమీ
శ్రీమత్కాంచన శైలకార్ముకధరా! శ్రీశైలమల్లీశ్వరా!

శా. ఏమింజెప్పిన నమ్మఁజాలవుదే యేప్రొద్దు న న్నేఁచకే
పామం చెచ్చెదఁ బట్టెదన్ వినవె నీపంతంబు లీడేరఁగాఁ
బామే పామ్ముగఁ జేసినావుగదరా పట్టేది నీకెంతరా
శ్రీమద్భూధరరాజకార్ముకధరా శ్రీశైలమల్లీశ్వరా.

మ. అది గాకున్నను బాసచేసెదను నీ వట్లైన నమ్మన్గదే
తుది నాజిహ్వను మడ్డు దాల్చెద నిదే తుచ్ఛంబుగాఁ జూడకే:-
అది నీకెంత యిరుగాలే కాలగరళం బన్నంబుగాఁ జేయఁగా
త్రిదశేంద్రాచ్యుత పూజితాంఘ్రికమలా శ్రీశైలమల్లీశ్వరా!

మ. చెలియా! యేమనివిన్నవించిన మదిన్ జేపట్ట వింతైన నా
వలన న్నేరము లెన్నియుంగలిగినన్ వామాక్షి కానంగదే
పలుమా రిట్టు వృథామాటల్ పలుకఁగాఁ బాండిత్యమాహా! రసీ
చెలువం బిక్కడఁ జూపవచ్చితటరా! శ్రీశైలమల్లీశ్వరా.

శా. ఏమే! పూర్ణశశాంకబింబవదనా యేమే జగన్మోహినీ
నీమీఁదాన మ ఱెక్కడన్ నినువినా నేనెక్కడన్ జొక్క నే
నామీఁదం గరుణించి యేలఁగదవే నన్నుం గటాక్షింపవే
శ్రీమించన్ భ్రమరాంబికా గుణమణీ స్త్రీలోకచూడామణీ!

శృంగారము.

ఉ. ఏడెమతెత్తునో పసిఁడివీణియమీటుచుఁ బ్రొద్దుపుత్తునో
కూడినకుంకుమంబు చనుగుబ్బలకొత్తుగఁ గౌఁగిలింతునో
వేడుకఁజంద్రకాంత మయవేదికమీఁదికిఁ బండవత్తునో
యూడిగమేమిరా యనుచు నూఱట పుత్తుగదే కళావతీ!

శా. ఆమహ్వంపు ట నంటిపొన్నగుమిలో నామూలపూఁదోఁటలో
నామాణిక్య పురత్నమందిరములో నాతూఁగుటుయ్యాలపై
మెమ్మై నిద్దురమెుక్కనాఁడు సుఖ సామ్రాజ్యంబు పాలించుటల్
స్వామేసాక్షిగ నెన్నఁడుఁ దలఁతు వాలాయంబు బింబాధరా!

ఉ. నాఁడొకనాఁడు నిన్ను నెలనాఁగరొ పొదిననాఁటనుండియున్
వేడుకపుట్టి మన్మథుఁడు వేదసేయఁగ నోర్వలేక నీ
వాడకు వచ్చిచూడఁదలవాకిటరావెటు తొంగిచూచినన్
వాఁడినచేని మీఁదికినివానలు వచ్చునటే కళావతీ!

చ. సరసిజనేత్రి! యోవిమలచంద్రనిభానన! రాజహంసి! యో
మరునిశరంబ! పుష్పలత! మానిని! రత్నము! కీరవాణి! యే
విరహముచేతఁ జిక్కికడు వేదనఁ బొందితిఁ గౌఁగిలింపవే
శరణుశరణ్యమే మెఱుఁగుఁ జక్కనిచెక్కులముద్దులీఁగదే.

## శ్రీనాథుఁడు పద్మసాలెమిటారిపైఁ జెప్పినపద్యము.

సీ. పరుగేచోఁ జూచుఁగుడియెడమల యందు
సంచరించెడివిట సముదయముఁ
బోగులు గట్టుచోఁ బొరుగిండ్లచిన్నప్రా
యపుటింతులకు నుపాయములు గఱపుఁ
గండెలుచుట్టుచోఁ గన్బొమసైఁగతో
సొగసుకాండ్రకుఁ జెంకిచోటుఁజూపు
అచ్చువేయదుకుచోఁ హాస్యరసంబుఁ
జెలికత్తెలను మాఱుపలుకరించు

గీ. నాపలీవలి సతులతో హాస్యమాడు
మోకుబిగియించుచోఁ బతిమోసపుచ్చుఁ
గుంచెపిడి పట్టియాడ్చుచుఁ గొమరు మిగులుఁ
బద్మసాలెది వగఁదేటి బలుమిటారి!

## జంగమురాలిమీఁదఁ జెప్పినది.

క. చెవినివి నీలపురాలా
యువిదరో నిను రతులఁదనుప నొకనితరాలా
యివి రుద్రాక్షసరాలా
జవరాల మహాత్మురాల జంగమురాలా!

## మఱికొన్ని.

సీ. శృంగారజలధిరా బంగారుబొమ్మరా
సంగీతలోలరా సరసిజాక్షి
అరవిందపాణిరా యలికులవేణిరా
కోకిలవాణిరా కోమలాంగి
కలియుగరంభరా కరిరాజగమనరా
నటనప్రవీణరా కుటిలకేశి
కలికిరాచిలుకరా కమ్మపూమొలకరా
యిందుబింబాస్యరా కుందరదన
గీ. బిగువుకంచెలచెలిగూడఁ బ్రేమతోడ
భోగసామ్రాజ్యమునఁ దేల నరా దేల
చారుతరమూర్తి! దేవతాచక్రవర్తి
రమ్యగుణధామ! కావేటిరంగధామ;

సీ. వీణె చక్కఁగఁబట్టి వింతగా రాగంబు
వాయింపనేర్చిన వనితగాదు
సంగీతసాహిత్య సరసవిద్యలచేత
మెప్పింప నేర్చిన మెలుతకాదు
ఆటపాటలచేత నభినయంబులచేతఁ
గరఁగింపనేర్చిన కాంతగాదు
సరిచక్కఁగాఁజిక్కి కసుగందకుండంగ
రతిఁగొల్పనేర్చిన రమణిగాదు
గీ. ఏమనగ మెచ్చితో చాలు నింకనీవు
తలఁగిరావయ్య యీజాణతనముమాని
రత్నములమూట సిరికోట రాజుపేట
బాలగోపాల! రాధికాప్రాణలోల!

క. సతి కైదుముళ్లు గల నట
పతి విప్పను రెండుముళ్లు బలవంతమునన్
హితమున నొకముడి వీడును
తతిఁ దక్కిన రెండుముళ్లు తామే వీడున్.

గీ. త్రిమ్మరీఁ డొక్క బంగారునిమ్మపండు
కేలఁ గీలించి మెల్లనె గిల్లిచూప
మేజపైనున్నచిత్తరు గోడమీఁద
ప్రొద్దుపై వారిజాతాక్షి బొట్టుపొడిచె.

## చిత్రపశ్నోత్తర పద్యములు.

క. ఎద్దీశున కశ్వంబగు
గ్రద్దన నేదడవిఁ దిరుగు ఖరకంటకిరయై
హద్దుగ నేవాఁడుఘనుఁడు
పద్దుగ నుత్తరము లిందె పడయంగా నా.

గీ. ఘూఠనికరమేదురమును జూచి మెచ్చు
రహిఁ గలువయలరేఁని రాకఁ గోరు
బూవు లేమావిగున్నకుఁ బొడమకుండు
నరయ నుత్తరములు నిందె యమరియుండు.

గీ. దాస మేదానియందగుఁ దలఁచిచూడ
జారుఁ డేకాంతకాంతాప్తిఁ గోరుచుండు
గాంత యేరాఁడ్రలోఁ గడుఁ గయ్యమాడు
నరయ నుత్తరములు నిందె యమరియుండు.

గీ. పుడమిఁ బగ ఱేనిఁ జెండాడి పొలుపుగాంత్రు
కనఁగ నేమియుండును బండికంటికొనను
జనము లేమికోరంగను జాలకుండు
రరయ నుత్తరములు నిందె యమరియుండు.

## కలగలుపుపద్యాలు.

నైజామురాష్ట్రమున నొకయగ్రహారికుఁడు తమయగ్రహారపుస్థితిగతుల ను దురకసంస్కృతాంధ్రములతో శ్లోకముచెప్పి ప్రభువునకు నివేదించినాఁడట!

శ్లో. ఫలంలేదు మజ్కూర్ కలంబందు హాల్ సాల్
ఆలం మోదుగాకుల్ క్వచిత్ టేకుమాకుల్
అవుర్ కోయకొంపల్ మరీ మాలకొంపల్
హరయే ముళ్లకంపల్ హమారే గ్రహారే!

శ్లో. తుమారాజవానుల్ హమారేగ్రహారే
కదాపీహదంగా సజాసేయకుండర్।
హుకుం దీయతాం నో హకాంచాపి పద్యా
త్ఖుదాతే మదేస్తా త్సదా జంగలీశే!

ఇట్టి దిట్టఁడే వేఱొకఁడు:—

శ్లో. తిండి కైతె పదిమంది వసంతి
తండులాలు గృహమందు నసంతి
కుండబొచ్చెలు పరం విలసంతి
కండనాకొడుకు లెల్ల హసంతి.

## రామాయణచాటువులు

సీ. శ్రీమత్సకల గుణశ్రేణోర్ధ సంపన్ను
లయిన శ్రీరాజ్యా భ్యుదయసమృద్ధి
మన్మహామేరుసమానధీరు లయిన
దశరథేశ్వరులకుఁ దాల్మితోడ
జనకమహారాజు సాష్టాంగములు చేసి
వేడ్కఁ జేయంగలవిన్నపములు—:
ఇక్కడ శుభమువిూయొక్క సంతోషంబు
[illegible]

తరువాత:— శ్రీరామధాత్రీశునకుఁ జైత్ర
శుద్ధపంచమినాఁడు సొంపుమీఱ
మాపటిలగ్నాన మాపట్టిసౌభాగ్య
వతి సీత నిచ్చి వివాహమహము
ఇక్కడ మిథిలలోనే చేయఁబెద్దలు
నిశ్చయించిరి గాన నిందు వేడ్క
గీ. సహాకుటుంబము పరివారసహితముగను
విభవమున వచ్చి మీరలీ శుభముహూర్త
మెలమిఁ జేయించి ప్రమదంబుకొలుపవలయు
నెలయఁగా నివె పదివేలవిన్నపములు.

సీ. ఎవరయా మీరు చక్కని[?]రాజు లిద్దఱు
నర్కవంశ్యుల మయోధ్యాపురంబు
మీపేరు లెవరయా? ఓపుణ్యనిధులార
రాఘవుం డతఁడు నే లక్ష్మణుండ
దండంబుదండంబు దశరథసుతులార
వర్ధిల్లు వర్ధిల్లు వానరేంద్ర
ఎందు కేంచేస్తిరో యినకులోత్తములార
యిచ్చోటఁ గార్యంబు నెఱుఁగవస్తి
గీ. వాయుపుత్త్రుండ హనుమను వచ్చినాను
భానుపుత్త్రుండు సుగ్రీవు బంట నేను
చెలిమిమీకును మాకును జేయఁగాను
అతఁడు మీరున్నచోటికి నంపగాను.

## భారతకథ

సీ. గర్వితద్విట్క్రౌంచ గాంగేయుగాంగే...
ఘనవైరిభీకరజ్యక్కణ్ణఁ గన్న

నిష్ఠురశాత్రవానీకనిష్కృపుఁ గృపుఁ
 త్రుటితారి తనుకృతద్రోణు ద్రోణు
భయరహితారాతి భయదత్తు భగదత్తుఁ
 జండపరామిష శకుని శకుని
లక్షజితేంద్రజిల్లక్షణు లక్షణు
 సకుటిలరిపుమనశ్శల్యు శల్యు
గీ. అహితధూమకేతు నహికేతు నాత్మీయ
 విశిఖవృష్టిచేత బెగడుపఱిచి
ఘనులఁ గ్రమ్మఱించెఁ బ్రతిభసహస్రబా
 హార్జునుండునైన యర్జునుండు.
సీ. ఖండితవైరి శిఖండి ఖండించెను
 రిపుజీవజీవనగ్రీష్ము భీష్ము
పాంచాలతనయుండు మించిమర్దించెను
 శత్రుపురాసురస్థాణు ద్రోణు
చండమదోద్వృత్తిఁ జెండాడె గాండీవి
 పరరాజసర్పసుపర్ణుఁ గర్ణు
విమతాగహతిహేతి యమసూతి శిక్షించె
 సమదరాజన్య దృక్శల్యు శల్యు
గీ. పొడిచి గెల్చిరి మాద్రేయు లడరికదిసి
 సమదగర్విత శత్రునాశకుని శకుని
భీమబలుఁడైన భీముఁడు పీఁచమడఁచె
 రాజ్యబలగర్వితుల ధృతరాష్ట్రసుతుల.
శా. ఎట్రా శేషుఁడు పోసరించె సభని స్నైగ్ధాడఁ గా రత్న మీ
డట్రా వాసుకితక్షకాహి ధృతరాష్ట్రి మాత్యకర్కోటకుల్

చుట్రటా నిల్తురు గాక నిన్ను సమరక్షోణిక విజృంభించి యా
గట్రాచూలివిభుండె దిర్చిన సహంకారంబు వారించెదక.

## భాగవత చాటువులు.

సీ. భావింపదేవకీదేవిమాయ త్తమ్మ
మామామవసుదేవ మాన్యుఁడమ్మ!
బలభద్రమూర్తి మాబావ గానలెనమ్మ
కొమ్మరేవతి తోడికోడలమ్మ
సకియరుక్మిణి మాకు సవతియేర్పడెనమ్మ
తగఁబంచశరుఁడె మాతనయుఁడమ్మ
మగువరో సాత్యకి మఱది గానలెనమ్మ
యలసుభద్రయు మాకు నాఁడుబిడ్డ

గీ. ఇంద ఱున్నాఱు నున్నందుకేమి ఫలము?
కలిమిబలఁగము సకలభోగ్యములు గలవు;
ఎన్నియున్నను నింతుల కెందుకమ్మ?
ప్రాణనాథుండు త న్నేడఁబాయుచున్న!

సీ. నల్లనికస్తూరి నామంబుక్రిందను
దిలకంబు కొనగోర దిద్దినాఁడు
రంగైనపదివన్నె బంగారుతాయెతుల్
పట్టువన్నెల సిగం జుట్టినాఁడు
మెఱుఁగుదేరెడి నీలమేఘవర్ణపు మేన
మంచిగంధ మలంకరించినాఁడు
ఘననవరత్నసంఘటిత మైవెలిఁగెడు
కడియముల్ సందిటఁగట్టినాఁడు

గీ. తొడరి దంతపుఁ గావలు తొడిగినాఁడు
వెలఁది చెంగల్వ పూదండవేసినాఁడు

సుందరాంగుండు దేవకీనందనుండు
చెలఁగి మేనత్తతోఁ బొందుచేసినాఁడు.

## సమస్యలు.

"తోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్"

ఉ. చూచితి భూతలేంద్ర యొకచోద్యమృగం బని సీత పల్కఁగా
లేచి శరాసనాంబకము లీలగఁ జేకొని త్రేయఁబోవ మా
రీచుఁ డరణ్యవాటిని జరించెడు మాయలు రాముకంటికిన్
దోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్.

ఉ. పాచికలాడి సోలి పిదపన్ గురురాజును గెల్చి మిక్కిలిన్
యాచకకోట్ల కిచ్చి బహుయాగముల న్నొనర్చినట్టి యా
కీచకవైరిసోదరుఁడు గెల్చినరుద్రుజడన్ శశాంకుఁడున్
దోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగు చాడ్పునన్

ఉ. కాచిఫలించు నోషధులుగల్గు గిరిన్ ధరియించి బాహువుల్
వీచుచు నబ్ధిదాఁటి కపివీరబలంబులఁ బ్రోనఁ గ్రక్కునన్
ఖేచరమార్గమందుఁ జనుకేసరినందనుఁ డభ్రమం దిలన్
దోఁచు నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్.

తామసి తా మసి గాకపోవునే.

చ. పురములఁ గాల్చిపొల్చె ఫణిభూషణుఁడై నుతి గాంచి మించెఁ గం
ధర గరళంబు దాల్చె సెగకంటను మంటలు రాల్చె నట్టి యీ
శ్వరు నెదిరింపఁ జాల ననఁజాలక యింద్రుఁడు పంప వేలరై
తటిమి యెదిర్చి మన్మథుఁడు తామసి తా మసి గాకపోవునే.

చ. హరునిజయించినాఁడు హరి నర్మిలి సారథిఁ జేసినాఁడు లన్
జెఱవిడపించినాఁడు తనసేనలతోఁ గొనిపోవు గోవులన్
మఱలిచినాఁడు క్రీడి యని మాటదలంపక రాజరాజు తాఁ
దటిమి యెదిర్చి పాండవులఁ దామసి తా మసిగాకపోవునే.

చ. హరునిశరాసనంబు తెగటార్చిన చందము పార్థ భంగముం
దురమున వాలిచావు ఖరదూషణు లాదిగదైత్యులీల్గుటల్
అరయఁగ దైత్యులుం గపులు నైనవిధంబు నెఱింగిరాముతో
వఱిమి యెదిర్చి రావణుఁడు తామసి తా మసి గాకపోవునే!

శంఖంబుల్ దివినుండి జాఱిపడియెం జంబూఫలప్రక్రియన్.

శా. ప్రేంఖత్ప్రేమను సత్యభామకొఱకై కృష్ణుండు నీడేజరా
ట్కాంఖాణస్థితిఁ బారిజాత మిల వేడ్కందేఁగఁ దద్వాసనా
కాంక్షాయుక్తము లై మిళిందములు పేర్మిం బద్ధ సంఖ్యల్ మహా
శంఖంబుల్ దివినుండిజాఱిపడియెం జంబూఫలప్రక్రియన్.

రాధేయుఁడు నందినెక్కి రావణుఁ గెలిచెన్.

క. యోధెవ్వఁడు కురుబలముకు
మాధవసఖుఁడేమి యెక్కి మఱి తిరుగాడున్
సాధించె రాముఁడెవ్వని
రాధేయుఁడు నందినెక్కి రావణుఁ గెలిచెన్

గుఱ్ఱమునకు నైదుకాళ్లుకోడికి వలెనే.

క. కత్తిచెలి యెక్కి తిరిగెడి
గుఱ్ఱమునకు నగతనూజకొమరుండెక్కె
గుఱ్ఱమునకుఁ బద్మోద్భవు
గుఱ్ఱమునకు నైదు[?]కాళ్లు కోడికి వలెనే

అర్భ, దర్భ, నిర్భ, వచ్చునట్లుసమస్య [రామలింగకవియట
పూరించినది.]

క. అర్భకులు లేకకూచన
దర్భల పాపన్నకిచ్చెఁ దన యాలిని నా
నిర్భాగ్యుఁడు తనచే మఱి
గర్భముగాకున్నఁ బోతు గాడ్దెలకోసఁగెన్.

[రాయలుకోపింపఁగా రామాయణకథాదిపరముగా మరలఁజెప్పెనట.

క. అర్భకులు లేక యాజియు
దర్భలశయనమునఁ బండి తపసి వసిష్ఠున్
నిర్భయతవేఁడి సతులకు
గర్భంబగు నట్టి క్రతువు గావించె నొగిన్.

క. అర్భకులు గల్గుటకు సం
దర్భముగా కున్న మదిని దపియించుపతిన్
నిర్భరత వేఁడి యముచే
గర్భముధరియించి కుంతి గాంచెఁగుమారున్.

తిలకాష్ఠమహిష బంధము.

క. తిలకాష్ఠ మహిషబంధము
ఫలములు భోజ్యములు యజ్ఞపశువుల నేనే
యిలఁగూర్చు కొంటి రాముని
బిలువఁగ నచ్చితిని బంధభీతులఁ బ్రోవన్.

క. వలలుండు ప్రాయ్యమీఁదను
గలకలమని కాఁగుబిండి గంజికి దింపన్
దిలకాష్ఠమహిషబంధము
సులభతఁ దెమ్మనుచుఁ దోడి సూదునిఁబంపెన్.

ఈ సమస్య యల్లమరాజు సుబ్రహ్మణ్యకవి పూరించినదట.

ఉ. వస్త్రమువహార రత్నములు వన్నెనగల్ పులిమీఁద వచ్చునా
పుత్రయటన్నరీతి జిగిఁ బొల్పగు మాచుకలీలఁ జూచుచున్
దొత్రిల నేల శీలఁ గొని గోరులనొక్కము నాథయంచుఁ దాఁ
గుత్రయొనర్చె లేమ తనగుబ్బలయుబ్బు సహింపలేమిచేన్.

విద్వా నభినవరాయ బిరుదాంకితుఁడగు మాడభూషి వేంకటాచార్యకవి పీఠికా పురాధీశ్వరు నాస్థానికి శతావధానము చేయ నరుదేరఁగా "ఇఁక" నని యారంభించి కందపద్యముతోఁ బ్రభుగుణకీర్తనముచేయ నీయన కోరెనట! ఆశువుగా వేంకటాచార్య కవి చెప్పినపద్యము:—

క. ఇఁక నెవ్వరి కీర్తులు నీ
ప్రకటగుణుండైన రామరాయక్ష్మాభృ
త్సుకృతి జనపోషకుని కీ
ర్తికి సరిగా రావు సుమ్ము పృథ్వీస్థలిలోన్.

అరసున్న ప్రాసము రాలేదని యాచార్యులుగారి నాక్షేపించి సుబ్రహ్మణ్యకవి యీ క్రింది పద్యమును జెప్పెనట:—

క. ఇఁక విను నీయశమునకుఁ ద
లఁకి శశి కృశుఁడయ్యెను మఱలఁ బెరుఁగ వేర్వె
ల్లఁకియుఁ గొనునో తొలిమలక
లఁకులను శ్రీరామరాయ లలితశ్రేయా!

సభాపతి.

క. శ్రీశమ్యుఁడు సంతతశ్శం
గారుఁడు రాజాన్వయప్రకారుఁడు నుతదా
నారూఢుఁడు సకలకళా
పారంగతుఁ డనఁగ నాసభాపతి యొప్పున్.

క. తరుణుండై నవరత్నా
భరణుండై గంధపుష్ప పరిమళయుతుఁడై
పరనారీ సోదరుఁడై
పరగినవాఁ డమరు నాసభాపతియనఁగన్.

క. తనయుల మంత్రుల మిత్రుల
నునిచి సమీపమునఁ దగు నియోగుల విద్వ
జ్జనులను మన్ననఁ గొందఱ
కునుఁ దగునాసనము లిచ్చి కూర్చుండఁగన్.

క. నరపతిరైై ధనిరై సు
స్థిరమతిరై సకలవిబుధ సేవితవిద్యా
పరిణతుఁడై చతురుండై
పరగినవాఁ డమరు నాసభాపతి యనఁగన్.

క. భావజ్ఞుల రసికుల సం
భావనగలవారి రాయబారులఁ గవులన్
రావించి యథాసనమున
భావనతో నునుపవలె సభాస్థలి నడుమన్.

క. వీరాహవమున విజయియు
ధీరోదాత్తుండు సుగుణతేజోనిధియై
యారయ సింహాసనమున
నారూఢుం డగుచు నొప్పు నాసభ నడుమన్.

వ. ఇట్లు కొలువున్న సభాపతిలక్షణం బెట్టి దనిన బ్రహ్మదేవుని వామదక్షిణ భుజంబులం బ్రభవించిన సోమసూర్యవంశంబులం దుదితుండై రాజసతామస సాత్త్వికంబులనియెడు గుణత్రయంబు తెలిసి దానధర్మ పరోపకారంబులు సేయుచు స్వర్గమర్త్య పాతాళంబు లనియెడు లోకత్రయంబు నెఱింగి భూత భవిష్య ద్వర్తమానంబు లనియెడు కాలత్రయంబును బ్రహ్మ విష్ణు మహేశ్వరులను మూర్తిత్రయంబు నెఱింగి ప్రభు మంత్రోత్సాహంబులను శక్తిత్రయంబు గలిగి శత్రు మిత్రోదాసీనుల గుఱ్ఱెఱింగి ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్నంబులను త్రికాలంబుల వార్చి యాహవనీయ దక్షిణాగ్ని గార్హపత్యంబు

లను త్రేతాగ్నుల ప్రభావంబులం దెలిసి దారేషణ పుత్రేషణ ధనేషణంబులను నీషణత్రయను వర్జించుకాలంబెఱింగి కృత త్రేతా ద్వాపర కలియుగంబులను చతుర్యుగంబుల ధర్మంబు లెఱింగి ధర్మార్థకామమోక్షంబులను చతుర్విధ పురుషార్థంబులం దల్పరుండై, యాన్వీక్షికీ త్రయీవార్తా దండనీతులను విద్యా చతుష్టయంబుం గని ఋగ్యజు స్సామాథర్వణంబులను చతుర్వేదంబులం బ్రస క్తుండై వేదశాస్త్ర పురాణేతిహాసంబులం దాదరంబు గలిగి సామభేదదాన దం డంబులను చతురుపాయపరుండై బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థ భైక్షుకంబు లనియెడు చతురాశ్రమంబు లరసి రక్షింపుచు రథగజాశ్వ పదాతులను చతు రంగబలంబులఁ గలిగి మనోబుద్ధ్యహంకార మమకారంబులను చతుర్విధ తత్త్వ పరిజ్ఞానుండై, క్షౌరాభ్యంగ దంతధావన నిర్మల వస్త్రంబులను నలుతెఱంగుల గలుగటికలుగలిగి వస్త్రాభరణ గంధపుష్పంబులను చతుర్విధశృంగారసంతుండై. ఉన్మదన మదన వశీకరణ సంతాపనంబులను చతుర్విధ మదనమార్గణంబులు తెలిసి, భద్ర దత్త కూచిమార పాంచాలురంబోలి, విటవిదూషక నాగరక పీఠమర్దకులయు, చిత్తిని హస్తిని శంఖిని పద్మిని యను చతుర్విధజాతి స్త్రీలయు లక్షణంబుల నెఱింగి బాలాయువతీప్రౌఢాలోలలను స్త్రీలనయః పరిపాకంబు నెఱింగి యనుభవింప నేర్పుచు, చతురికాచారికా సంచారికా దూతికాలక్షణంబుల నెఱింగి పృథివ్యప్తేజోవాయ్వాకాశంబు లను పంచభూ తంబులను శబ్దస్పర్శరూపరసగంధంబుల నెడుపంచభూతతత్త్వంబులను త్వక్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులను పంచేంద్రియంబులను వాక్పాణిపాదపాయూపస్థ లను పంచకర్మేంద్రియంబులను ప్రాణాపానవ్యానోదాన సమానంబులను పంచ ప్రాణంబులను నెఱింగి ప్రారంభోపాయపురుషసంప ద్దేశకాలవినివిభాగపాత్రప్రతీ కారసిద్ధినిశ్చయంబు లను పంచాంగతంత్రబుల నెఱింగి, ఊదుట, వ్రేయుట, మీటుట, వాయించుట, కంచుగీచుటలను పంచమహాశబ్దంబుల నెఱింగి స్త్రీ రత్నాశ్వరత్న విద్యాద్రత్నాన్న దానపుత్త్రి రత్నంబులనియెడు పంచరత్నంబులఁ

దెలిసి, బ్రహ్మయజ్ఞ దేవయజ్ఞ పితృయజ్ఞ ఋషియజ్ఞ భూతయజ్ఞంబులను జేయుచు, గోమూత్ర గోమయ దధి ఘృత క్షీరంబులను పంచగవ్యంబుల నెఱింగి, మిత్రభేద సుహృల్లాభ సంధి విగ్రహ లబ్ధప్రణాశ సంప్రేక్ష్యకారిత్వంబులను పంచతంత్రంబుల నవలోకించి అరవిందాశోక చూత మల్లికా నీలోత్పలంబులను పంచబాణంబులకు లోనుగాక భక్ష్యభోజ్య లేహ్యచోష్య పానీయంబులను పంచవిధాహారంబులను కటుతిక్తలవణ మధురామ్ల కషాయంబులను షడ్రుచుల ననుభవింపుచు, సంధివిగ్రహ యానాసన ద్వైధీభావ సమాశ్రయంబులను రాజ షడ్గుణంబుల నెఱింగి కామక్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులను నరిషడ్వర్గంబు విసర్జించి, హిమ శిశిర వసంత గ్రీష్మవర్షా శరత్తులనియెడు షడృతువుల ధర్మంబుల నెఱింగి నడచుచు, హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ స్సగర కార్తవీర్యులను నార్గురుచక్రవర్తుల చరిత్రంబులవినుచు శైవవైష్ణవ శాక్తగాణాపత్య చార్వాక బౌద్ధంబులను షడ్దర్శనంబులకు సముండై వేదాంత వైశేషిక భాట్ట ప్రాభాకర పూర్వోత్తర మీమాంసలను షట్ఛాస్త్రంబులను పరీక్షించుచు యజన యాజనాధ్యయనాధ్యాపన దాన ప్రతిగ్రహ షట్కర్మ నిరతులైన బ్రాహ్మణుల నరసి రక్షింపుచు, జంబూప్లక్ష కుశక్రౌంచ శాక శాల్మలీ పుష్కరంబు లనియెడు సప్తద్వీపంబులం గీర్తివెలయ,నాందోళికాంబరాభరణవాహన రాజ్య సతీ కర్పూర తాంబూలంబులను నుచిత సప్తాంగంబులు గలిగి సామదాన భేద దండ మాయోపేక్షేంద్ర జాలంబులను సప్తోపాయంబుల నెఱింగి స్త్రీ ద్యూతపాన మృగయా వాగ్దోష దండదోష నిరర్థక వ్యయంబులను సప్త వ్యసనంబులు వర్జించి సుతనిధి దేవగేహ వనతటాక సత్కృతులు నల్లిల్లు నను సప్త సంతానంబులం బడసి, కవి విద్వత్పౌరాణి కైతిహాసిక భట పరిహాసక గాయకులను సభా సప్తాంగంబులం బరివేష్టితుండై లవణేక్షు సురా సర్పి ర్దధి క్షీర శుద్ధోదంబు లనియెడు సప్తసముద్రంబుల నెఱింగి మహేంద్ర మలయ సహ్య శుక్తిమ గంధమాదన వింధ్య పారియాత్రంబు లను

సప్తకులపర్వతంబుల నెఱింగి, బ్రాహ్మీ మాహేశ్వరీ కౌమారీ వైష్ణవీవారాహీం ద్రాణీ చాముండలను సప్త మాతృకల నర్చించుచు, స్వామ్యమాత్య సుహృ త్కోశ రాష్ట్ర దుర్గ బలంబులను సప్తాంగబులు గలిగి, కశ్యపాత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ జమదగ్ని వసిష్ఠులను సప్త మహర్షుల నెఱింగి, అయోధ్యా మధురా మాయా కాశీ కాంచ్యవంతికా ద్వారావతు లనియెడు సప్తపట్టణం బులంజూచి, యమ నియమ ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణ సమాధి యోగంబు లనియెడు యోగాష్టాంగంబుల నెఱింగి, దాసత్వము దారి ద్ర్యము, దారహైన్యము స్వయంకృషి యాచ్ఞ ఋణము, మార్గము నడచుట యనియెడు సప్తకష్టంబులంబొందక, వరుణుండు, ధ్రువుండు ఆగ్నేయుండు ఉపరిచరుండు ప్రత్యూషుండు ప్రభాసుండునను నష్టవసువుల నెఱింగి యన్న వస్త్ర గంధ పుష్ప తాంబూల వనితాశయన సంగీతంబులను నష్టభోగంబుల నను భవింపుచు దాసీ బంధు సుత భృత్య వస్తు వాహన ధన ధాన్యంబులను నష్టైశ్వ ర్యంబులు గలిగి, కులరూపగుణ విద్యా ధన యౌవన బల రాజ్యతపంబులను నష్ట మదంబుల నహంకరింపక, కస్తూరి కర్పూరము చాఁదు జవాది, అగరు పన్నీరు తట్టుపునుఁగు గంధమునను నష్టసుగంధ పరిమళ లేపనుండై, - శృంగార వీర కరుణాద్భుత హాస్యబీభత్స రౌద్ర శాంతభయానకంబులను నవరసంబుల నావే శంబుగలిగి, ముక్తామాణిక్య వజ్ర వైడూర్యగోమేధికపుష్యరాగమరకత నీల ప్రవాళంబులను నవరత్నగుణవిశేషంబులం బరిజ్ఞాతుండై పద్మమహాపద్మ శంఖ మకర కచ్ఛప ముకుంద కుంద నీల వరములను నవనిధానంబులం గలిగి మరీచి అత్రి ఆంగిరసుఁడు పులస్త్యుఁడు పులహుఁడు క్రతుఁడు భరతుఁడు దక్షుఁడు వసిష్ఠుఁడు నను నవబ్రహ్మల నెఱింగి, సూర్య సోమ కుజ బుధగురు శుక్ర శని రాహు కేతువులను నవగ్రహంబుల విమర్శంబు గలిగి, యింద్రఖండ తరు ఖండ తామ్ర ఖండ చక్రఖండ నాగఖండ సౌమ్యఖండ బ్రహ్మ ఖండ గభస్తిఖండ భరతఖండంబులను నవఖండంబుల నెఱింగి మఱియు

మ భ జ స న య ర తంబులను నష్టగణంబులను, స్వరప్లుతోభయ వృద్ధ్యను స్వార
వికల్పప్రాదిభేద బిందుసంయుక్త భిన్నప్రత్యేకవిభాగ కాక్వాదేశ నిత్యాఖండ
వర్గుచక్కటె క్కటి పోలికసరసంబులను నిరువది నాల్గువళ్ల భేదంబుల నెఱింగి,
ఋతు నాయక నవరతి జలకేళీ ప్రయాణ రణ మధుపానార్కోదయ చంద్రో
దయమహీపతి పురగిరి మంత్రదూత పరిణయవార్తాశ్వగజ వన వర్ణనలను నష్టాదశ
వర్ణనలం దెలిసి, సంస్కృత ప్రాకృతశౌరసేనీ మాగధీపైశాచికామాలికా
పభ్రంశ తెలుంగులను నష్టభాషలం బ్రవీణుండై ఛందోభంగయతిభంగ విసంధిక
పునరుక్తి సంశయాపక్రమవ్యర్థ మహాపర్దంబు విరూపిత శబ్దవిరోధంబులను దశ
దోషవివర్జితుండై, కుసంధి, దుస్సంధి, చుట్టుప్రావ, వైరివర్గంబు దేశవిరో
ధంబు కులుచకాకు, నిడుదకాకు, తెలుంగులకుం జొఅరాని సంస్కృతక్రియ
లు, దుష్ప్రయోగంబులను దశవిధాపశబ్దంబులుం చొఅనీయక, నవరసాలం
కారంబై ఛందోబద్ధంబై మృదువర్ణవాక్యంబులు గలిగి వాక్యదశదీపితార్థ
వైభవంబుల నెఱింగి లక్షణలక్ష్యంబులు కావ్యనాటకాలంకారంబులు చెప్ప
నేర్చిన సుకవివరులకు నిధి నిక్షేపజలపాషాణాక్షీణాగామి సిద్ధసాధ్యంబులను
నష్టభోగతేజస్స్వామ్యసహితంబుగా గృహారామక్షేత్రంబుల నిచ్చి యరసి
రక్షించుచు, మాతుసని చింతించుట, వగచుట, యుస్సురనుట, కొనియాడుట,
సిగ్గెఱుంగకుండుట, అన్నంబరుచికంబగుట, జ్వరమువచ్చుట నాలుకలో ప్రౌఁవడి
యుండుట, జీవంబు తొలంగఁజూచుట ప్రాణపరిత్యాగంబు సేయుట యను
దశావస్థలమర్మంబులు దెలిసి, వణఁకుట, తలనొప్పివచ్చుట గఱగఱికలు విడు
చుట ఆత్మమఱచుట తలపోయుట చింతనొందుట, కృశించుట, దైన్యంబు
నొందుట దుఃఖియగుట, ఊర్పులంబొరలుట, ఉన్నచోటెఱుంగకుండుట,
నిరాహారియగుట, క్రాఁగుట మానంబుఁదాల్చుట, అరజీవి తొలంగుట, సంహా
రియగుట, యనషోడశావస్థలభేదంబులెఱింగి అంగుష్ఠము, అరకాలు, మండ,
మోకాలు, [illegible], అధ

భము, కపోలములు నేత్రములు, ఫాలము మస్తకంబు నను షోడశకళాస్థాన మర్మవిభేదంబుల నరసి, తెల్లదమ్మి, కలువమొల్ల, ఎరిసె, మావి, జాజి, పొన్న అశోకంబు, విరవాది, మల్లె, పొగడ, గేదంగి, పాదిరి, కలిగొట్టు, సురపొన్న కదళికా పుష్పంబులను షోడశ బాణంబులను, చిగురువిల్లు, తీగవిల్లు, తీపువిల్లు, పూవిల్లు నను నాలుగు విండ్ల సంధించి యేయుమదన బాణంబులకు లోనుగాక హావభావ హేలా మాధుర్య ధైర్యలీలా విలాస విచ్ఛిత్తి విభ్రమ కిలికించిత మోట్టాయిత కుట్టమిత బిబ్బోక లలిత కుతూహల చకిత విహృత హాసంబులను పదునెనమిది శృంగార చేష్టలు గల స్త్రీల చిత్తంబుల నెఱింగి, స్తంభప్రళయ రోమాంచ స్వేద వైవర్ణ్య కంపాశ్రు వైస్వర్యంబులను సాత్త్విక భావంబు లెనిమిది నెఱింగి, నిర్వేదగ్లానిశంకా సూయా మదశ్రమాలస్య దైన్య చింతా మోహ స్మృతి ధృతి వ్రీడా చాపల్య హర్షా వేగ జాడ్య గర్వ విషాదౌత్సుక్య నిద్రా పస్మారసుప్తి ప్రబోధామర్షా వహిత్థాచండమతివ్యాధ్యున్మాద చరమ త్రాసవితర్కంబులన ముప్పదిమూఁడు సంచారి భావంబుల నెఱింగి, రతిహాసశోకక్రోధోత్సాహ భయజుగుప్సా విస్మయశమంబులను స్థాయిభావంబుల నెఱింగి జాజి మల్లె మొల్ల విరవాది సంపెంగ సేవంతి తామర చెంగలువ కలుగొట్టు గేదంగి గురువింద పొగడ, పొన్న, పాదిరి కరవీరము, అశోకము మంకెన సురపొన్నలాదిగాఁగల పుష్పంబులు, కురువేరు, పచ్చ, సమ్మేళనంబు గరియించి చాసీతి బంధంబుల రతితంత్రంబులఁ బ్రమదాజనంబులఁ దృష్టిచేయుచు మఱియు బ్రహ్మక్షత్త్రియవైశ్యశూద్ర వ్యావహారిక గోరక్షక పాంచాల (పంచాహణ) కుంభకార తంతువాయక్షౌరకరజకవస్త్రచ్ఛేదక చర్మకర్మక పతితకతిలఘాతక లుబ్ధక సంకీర్తక చాండాలమాతంగులను నష్టాదశజాతులు సంకరంబులుగాకుండ నరసి రక్షించుచుబ్రహ్మవసిష్ఠాత్రేయమనుపౌలస్త్య రోమశమారీచ నారదశౌనక భృగుచ్యవనగార్గ్య పారాశరంబులను జ్యోతిష సంహితలలక్షణంబును, పౌరజ, రోమకవసిష్ఠ సోమసూర్య సిద్ధాంతంబులను పంచసిద్ధాంత జ్యోతిశ్శాస్త్రరహస్యం

బుల నెఱింగిన మహాజ్యోతిషి కులనరసిరక్షించుచు, నసి ముసల ముద్గర రోహణ కణయ కంపణ శిల్లు భల్లాతక, భిండివాల కలవాల కుంత కోదండ కఠారతోమర పరశు త్రిశూల వజ్రముష్టి గదా తౌదిలాంగూలంబులు నతళము నంకిణి, చక్రము సబళయీఁటె యినుపకోల సెలకట్టె పట్టెసము, ప్రకూర్మము, నఖమయూరము, దండనాసంబులను, బత్తీ సాయుధంబులనుం బ్రవీణుండై, లారి ప్లవ లక్షణ శుద్ధ చిత్ర దృఢత్వ దూరాపాతంబులు మెఱయ నేర్చి, మఱియు మంజరీ పళమంజరీ భూపాల శ్రీరాగ బంగాళ హిందోళ భైరవీ గౌళలను పురుషరాగంబు లెనిమిదియును గుజ్జరినారాయణి గుండక్రియ లలిత దేసితోఁడి మలహరి, బవుళి, వేళావతి, ఆందోళి, ఆహిరి, భల్లాతకి కన్నడగౌళ ధన్యాసి ఛాయాగౌళ రామక్రియ, వరాళి మంగళకౌశిక, నరప్రియ, ఖురంజి దేవగాంధారి సాళంగ నాట దేశాక్షి పూర్వగౌళయు నను నిరువదినాల్గు స్త్రీరాగం బుల నెఱింగి మాళవి గౌళరీతి గౌళనారాయణ గౌళబేతాళ గౌళ స్త్రీ వరాళి వసంతవరాళి శోకవరాళి నాగవరాళి పంతువరాళి తోటవరాళి బవుళి రామక్రియ, మేళరామక్రియ, నాదరామక్రియ, సామంతమలహరి చెంచుమలహరి కాంభోది గుమ్మకాంభోది మధ్యమావతిగుజ్జరి సామంత వసంత శుద్ధవసంత మేఘరంజ, దేశాలనాట, హంవీరనాట ముఖారి శంకరాభరణ హేజిజి పాతికు రంజి నీలాంబరియనియెడుముప్పదిరెండు నపుంసక రాగంబుల నెఱింగి, మాళవి శ్రీ దేవగుప్తి సావేరి కొండమలహరి కోనమలహరి శ్వేతకాంభోది దీపకంబు పంతులాదిగాఁగల మిశ్రంబులను, వేళలు, మైత్రియు, శ్రుతి జాతివర్ణంబులును శుద్ధసాళగసంకీర్ణంబులను స్థానప్రపంచ విస్తారంబులును, తతా వనద్ధ ఘన, సుషిరంబులను గీతవాద్యంబులను మంద్ర మధ్యమతారంబులను స్వర భేదంబులను సకల మోహన సంగీత విద్యా విశేషంబుల నెఱింగి చర్చరి,చారణి బహు రూపలక్షణ చాగుడంబు శుద్ధపద్ధతి ప్రేంఖణపద్ధతి, కుండలి నృత్యంబు దండలాస్యకంబు బాడికంబు రాసకాఖ్యంబు పాపరాశికంబు కందుక కోలాట

కంబులను షోడశ విధ నృత్య ప్రకారంబుల నెఱింగి ఛప్పన్నదేశభాషాప్రవీణుండై యక్షరలక్షణ వేద శాస్త్ర పురాణేతిహాస శిక్షావ్యాకరణ నిరుక్తచ్ఛందో జ్యోతి షాలంకార వశ్యా కర్షణ స్తంభనోచ్చాటనమారణ విద్వేషణాదృశ్య సంచు పరకాయ ప్రవేశగణిత లిఖిత గాంధర్వ వీణావేణుమృదంగతాళ నృత్యకవిత్వశూరత్వో దారత్వ సంగ్రామలక్షణ మల్లయుద్ధ బేతాళమత చిత్రకర్మముష్టిమోహనేంద్రజాలమహేంద్రజాల రథగజాశ్వజనరత్న భూపరీక్షా యోగశాస్త్ర మంత్రశాస్త్ర శకునశాస్త్ర శిల్పశాస్త్ర వైద్యశాస్త్ర మదనశాస్త్రాగ్ని స్తంభన జల స్తంభన ఖడ్గ స్తంభన దృష్టి స్తంభన జిహ్వా స్తంభన శుక్ల స్తంభన రసవాద పీలువాద కాష్ఠవాద ధాతువాద గారుడంబు లనియెడు చౌషష్టివిద్య లందుఁ బ్రవీణుండై, మఱియు మహాప్రధాన మాండలిక సామంత సేనాధిపతి ద్వారపాలకావసర ఘటీకార పణిహార రాయభార గణక విజిర పురోహిత, పౌరాణిక, జ్యోతిషిక, కావ్యక విద్వ ద్దేవార్చక మాల్యకార పరిమళకరండాధికార గోష్ఠాధికారగజాధికా రాశ్వాధికార వస్త్రాధికారధాన్యాధికారో గ్రాణి కాంగరక్షక సూద సువ్వారిక చాణూరవేతాళ తాంబూలికాల పట్టిక నరవాహన ఛత్రక చామరక కాశాంజిక కతారిక పాపుడక నాట్యక హింకారిక కట్టిక భట్ట పాఠక పరిహాసక క్షౌరక రజక వస్త్రచ్ఛేదక చర్మకర్మకాడియాళక పురపాలక వనపాలక నరవైద్య గజవైద్యాశ్వ వైద్య పశువైద్య కాహళక, భేరిక, మృతాపక కారుక, సువర్ణకారక కుంభకారక చిత్రక వ్యావహారికకొట్టికమృగయాత్రక పక్షియాత్రకులనియెడు (కొన్నితప్పులు?) బాహత్తరినియోగంబులంగలిగి వ్రీహి యవమాష తిల ముద్గ కులుత్థ గోధూమ ప్రియంగు మసూరశ్యామాక నీవార వైణవము లను ద్వాదశధాన్యసంగ్రహణుండై, తులాపురుషహిరణ్యగర్భ బ్రహ్మాండ కల్పవృక్ష సహస్రధేను హిరణ్యకామధేను సువర్ణరథ హేమహస్తి కనకలాంగూల పంచమహాగ్రహ విశ్వచక్ర రక్తధేను భూతఘటదానంబులను(?) షోడశమహాదానధురంధరుండై ధ్యానావాహనాసనార్ఘ్య పాద్యాచమనీయ స్నానవస్త్ర యజ్ఞోపవీత గంధాక్షత పుష్పధూపదీప నైవే

వృతాంబూలంబులను షోడశోపచారపూజావిధానుండై యార్యధర్మంబు దప్ప
క వర్తించుచువాఁడు సభాపతి యనంబరగు.

## ప రి శి ష్ట ము.

### హరిహరరాయలు.

చ. హరిహరదేవ నీ పవినతారుల నద్భుతలీలఁద్రుంపఁగా
గరికరి వాజి వాజి నవఖండవిఖండవిఖండ ధారలై
యరుదుగ నీదు హేతిజశరాగ్నులఁ బర్వుచు నెప్పుడుండురా
ధరధర ధారధార ధరధార ధరాధర ధారధారలన్. [?]

### తిరువ శేంద్రుఁడు.

లయ. నిగనిగని చన్నులును నగుమొగములున్ నకన
కగు నడుములు న్మెఱయ జిగి నమరకాంతల్
నగధరుఁడు మెచ్చ భవదగణితగుణౌఘముల
నొగి థిమికి థింధిమికి దిగుద్ధిమి ధిమి లోం
దిగుద్దిగి దిగుద్దగణ తగుద్ద తతతోం తగణ
జగుధగిణ తత్తిగణ తెగుద్ద తత తత్తై
జగుద్దగిణ తాలిగణ తగుద్దతతతాయనుచు
మిగుల నటియింపుదురు తగఁదిరువశేంద్రా!

### సాగిబైచరాజు.

సీ. శూరత వైరిరాజులఁ గాని జక్కన
ద్రేయవు మాన గోవిందరాయ
అది లావు నిధిఘనం బనుదళంబులఁగాని
చొచ్చి నర్కవు దివిచూఱకార

ప్రఘనదత్తోఁడు మహాబలుఁడగు నృపుగాని
యొుఅయవు రాయరాహుత్తమిండ
షట్ఖానుఖానాది బలుదుర్గములుగాని
కొన విలఁ బురియమార్కోలు గండ
గీ. గండభేరుండ యుత్తమ గండబిరుద
వీరకేదార రణరంగ వీరభద్ర
సర్వగుణహార సాగిగన్నయకుమార
బళిర బైచామహాపాత్ర బహుచరిత్ర.
సీ. బహుముఖ బ్రహ్మాండ భాండంబు దివెగూడు
సంపూర్ణవీరంసంబు చముదు
భీమప్రతాపార్క బింబంబు తిరువత్తి
విజయసంగరభూమి వేటపాలము
పంచమహాశబ్ద బంధంబు గంటలు
కరవాలభైరవాకార మంబు
మేటివైరుల పాలిమృత్యువు చొప్పర
సహజసన్నాహంబు శక్తిగాఁగ
గీ. రాత్రిపగ లన కేప్రొద్దు రాజసమున
గంటవేటాఁడె దహితమృగములు సమయ
కాంతి హిమధామగండరగండ నామ
శత్రునారాచ గన్నయ సాగిబైచ.
సీ. సెరవుగాఁ జేసిన నెత్తురుదబ్బలు
గులుతుగా నంటిన క్రొవ్వుపొరలు
మేపుపొట్టలమీఁద మెదలాడు ప్రేవులు
చెదరి చించినగుండె చేరుగుదులు

మా హైనకుప్పలు మాంసఖండంబులు
చరణముల్ కరములు శల్యములును
మొసలికినూడిన మూలుగుకొండుపులు
పవనంబు వోవనిపచ్చితలలు
గీ. కందుకూరౌద్ధ భూతాలు కలసి మెసఁగ
ఘానమల్కల గెల్చు చేఘనము నీకు
బల్లసురభాణబిరుద సంపాదపాద
శత్రునారాచ గన్నయసాగిశైన.

సీ. పులితలాటంబుకై కలహించుదామెల్ల
మలయకునని [?] రేకుమడఁగగొట్టి
నెఱిగండభేరుండ బిరుదుకై పట్టిన
వెల్లంకులను నాజి విరుగఁద్రోలి
మునుక రక్తక్షేత్రమునకునై యొరసిన
యినుగంటితిమ్మని నేపణంచి.
బల్లెసురత్రాణపట్టు బిరుదముకై
సెట్టిపల్ రాఘవుచేత చెఱిచి
గీ. మఱియుఁ దక్కినమన్నీలనురము చేసి
మించె నీకీర్తి దిక్కుల మేదినందు
బల్లసురధాణ బిరుదసంపాదపాద
శత్రునారాచ ! గన్నయసాగిశైచ.

క. ఈసాగి శైచభూవరుఁ
డీసాగిన మొదలు నర్థులేచిరి సిరులన్
రా సాగి బల్లెమందిన
బోసాగిరి వైరులింద్రపురికిని నమరన్

మ. సరసాగ్రేసర సాగిగన్నయయకుమారా బైచభూపాల యి
ద్ధరణిన్ నీ కరిగోరు చెల్లునట చిత్రంబా తలంపంగ ని
ర్భరతారుణ్యవధూవిజృంభ యగురంభానారిపాలిండ్ల నీ
యరిగో రెంతయుఁ జెల్లుచుండునట జంభారాతి లోకంబునన్.

వాసిరెడ్డి వేంకటాద్రినాయఁడు

సీ. అంగుగా నపరంజి యంచుచీరె ధరించి
రంగైన మెఱుంగారు రవికఁదొడిగి
రమణు లందియ్యఁగా రహి రత్న ఖచితమౌ
సొమ్ము లందంబుగ సొబిదిఁదాల్చి
చెలికత్తెపై నొక్క చెయివైచుకొని, స్వామి
యింతప్రొద్దాయె రాఁ డేమటంచు
నెల్లిప్రొద్దండచే నల్లిన చల్లని
సురటిచేఁ బూని యచ్చోటనిలచి
గీ. రాకపోకల నిన్నె పరాకుమాని
యరయుచున్నది యదిగొ మాయమ్మ సాధ్వి
పరమదనకోటిలావణ్య వాసిరెడ్డి
వేంకటాద్రీంద్ర మన్నెహం వీరచంద్ర!

రాజనీతి.

ఉ. మానమె భూషణంబు చనుమానమె సౌఖ్యకరంబు నిర్మల
జ్ఞానమె ముక్తికాస్పదము గానమె విద్యలకెల్ల రాజు సం
తానమెపో ఫలంబు మహిధర్మమె తోడు తలంపఁగా నుదా
శీనమె పీడుకోలు గుణశేఖర పెమ్మయసింగధీమణీ!

సీ. మగనాలి మీఁదను మమత యుంచఁగరాదు
పగవానితో మించి సగఁగరాదు

నగరివాకిలినంటుమగువలఁ బిలరాదు
పతికాప్తుఁ గోపించి పలుకరాదు
చలపట్టి దొరతోడ సరిపడదనరాదు
చనవరితోఁ గంటు కనఁగరాదు
ప్రభువు చెప్పకయె తాఁ బనులు చేయఁగరాదు
పిలక డగ్గఱఁ బోయి నిలువరాదు
గీ. పరులు రా రాజుమొనచూపి పలుక రాదు
పగఱ యధికత స్వామితోఁ బొగడరాదు
నరులకెల్లను నీనీతి నడవ వలయుఁ
బ్రకట గుణసాంద్ర ! కంభము రామచంద్ర!
సీ. తలవరితో మించి కలహింపఁ గా రాదు
స్త్రీలస్వతంత్రలఁ జేయరాదు
జాతిఁదప్పినయట్టి నాతిఁజేకొన రాదు
నీతిమాలిన యెడనిలువ రాదు
ప్రభువు సమ్ముఖమునఁ బకపకనగరాదు
చనవునగర్వంబు గనఁగరాదు
కులమెఱుంగక యతికూతుఁ గైకొనరాదు
పరునికల్మి కసూయపడఁగరాదు
గీ. పదరియాసల ధర్మంబు వదలరాదు
చలము బొంకును సుజనులతోఁ జలుపరాదు
నరులకెల్లను నీనీతి నడవవలయుఁ
బ్రకటగుణ సాంద్ర ! కంభము రామచంద్ర.
సీ. అక్కఱకొదవనియర్థంబు వ్యర్థంబు
బంటుతనము లేని భటుఁడు నటుఁడు

రసికుఁ డేలనియట్టి రాజ్యంబు త్యాజ్యంబు
శీలంబువలఁ పనియాలు తేలు
మాటతప్పఁగనాడుమనుజుండు దనుజుండు
గౌరవంబెఱుఁగని యూరుపాఁరు
ధర్మంబుమానిన దానంబు హీనంబు
నయము వీడిన వానినంటు కంటు
గీ. పొదలు తమిఁ బూననిలతాంగి పొందుమందు
చెలఁగి సజ్జనుల్ మెచ్చని చేఁతరోఁత
యిష్టబంధులు నిండని యిల్లుపొల్లు
ప్రకటగుణసాంద్ర ! కంభము రామచంద్ర.

ప్రార్థనము.

సీ. నిఖిలభూనరదరీ నిమ్నోన్నతస్థలీ
విహరణాగతమైన వనుకబెణుకుఁ
యమిరక్షణార్థమై యమహ్వాత్క వాటంబుఁ
బగులఁదన్నిననాఁటి ప్రాఁతనొప్పి
బ్రహ్మాదిసకల నిర్జరకృతార్చనకాల
మున నిల్వఁ బట్టిన మొనయుగుదులు
నేకాంఘ్రిపైనిల్చి నృత్యామత్యంతంబు
విరచించునాఁటితిమ్మిరియుఁదీఱ
గీ. తోమి గ్రుద్దెదఁ బిసికెద ధూళిదుడిచి
వ్రేళ్లువిటిచెదఁ జూపవే కాళ్లు తండ్రి
నిగమనుతకీర్తి యెలకుర్తి నగరవర్తి
యీశ మల్లేశలింగ శుభాశతాంగ.

## సమాప్తి.

మ. తలకట్టిత్వము కొమ్ము నేత్వమును నైత్వం బొత్వముం బొట్టులున్
బలుసంయుక్తపుటక్షరంబులు విరామప్రాసశబ్దాదు లిం
దులఁ జేతప్పినఁదప్పు నజ్ఞుఁడను నన్ దూషింప కాతప్పు లొ
ప్పులుగాఁజేయుఁడు పెద్దలార! మిము నేఁ బ్రార్థన్ బ్రశంసించెదన్.

శ్లో. విసర్గబిందు మాత్రాది
పదపాదాక్షరాది చ
న్యూన మప్యతిరిక్తం వా
క్షమస్వ పురుషోత్తమ !

C. M. Veerabhadra Sharma.

---

